ఫోన్: 4406 టెలిగ్రామ్: హిందీసంఘ్

సంపుటి 4 సంచిక 11

# స్రవంతి

K. Gopala Krishna Rao
Lecturer in Telugu
Nizam College

సాహిత్య మాసపత్రిక

ఫిబ్రవరి, 1958

*

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

*

హైద్రాబాదు హిందీ ప్రచార సంఘం

327, రెసిడెన్సీ రోడ్డు — హైద్రాబాదు.

సంవత్సర చందా రు. 3-0-0

విడిప్రతి రు. 0-4-0

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis No 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో

*సంపాదకీయము :*

# రాజభాష - హిందీ

రాజభాషా కమీషన్‌వారి నివేదిక వెలువడి, హిందీ పార్లమెంటరీ సంఘ సమావేశములు జరుగుతూవున్న సమయంలోనే దక్షిణ దేశంలో హిందీ వ్యతిరేకోద్యమం తిరిగి విజృంభించి విస్తృత రూపాన్ని ధరించింది. హిందీని వ్యతిరేకించడానికి కార్యాచరణ సంఘం ఏర్పడడం, ఆ సంఘంలో శ్రీ రాజాజీ, సర్ సి పి వంటి ప్రముఖులు ఉండడం గమనించ దగిన విషయం హిందూవంటి ప్రముఖ ఇంగ్లీషు పత్రికలు ఈ ఉద్యమానికి తమ సంపాదకీయాల ద్వారా, తగిన ప్రోత్సాహాన్ని కల్పిస్తున్నవి

ఈ ఉద్యమంలో ఏదైనా గమనించదగిన విషయం ఉన్నదా అని ఆలోచించడం అవసరం.దక్షిణ దేశంలో ముఖ్యంగా - తమిళనాడులో - హిందీ వ్యతిరేకత ఏర్పడడానికి కారణం ఏమిటి అని చూస్తే రెండు కారణాలు కనబడుతున్నవి. ఒకటి, కేంద్ర ప్రభుత్వపు ఉద్యోగాలలో తమిళులు కేరళ ప్రాంతీయులు ఎక్కువగా ఉన్నారు. వారందరూ ఇంగ్లీషును ఆధారంగా తీసుకొని ఉద్యోగాలు సంపాదించినవారే బెంగాలీలు కూడా అదే విధంగా అధిక సంఖ్యలో ఉద్యోగాలు సంపాదించి వున్నారు హిందీ రాజభాషగా అమలులోనికి వస్తే ఇంగ్లీషు ప్రభావం తగ్గిపోయి తద్వారా ఉద్యోగాలలో వీరందరికీ ప్రాముఖ్యత ఉండదని వారికి భయం ఏర్పడి వున్నది. రెండవది, భారత దేశంలో హిందీ మాట్లాడేవారి సంఖ్య హెచ్చు వారు అఖిలభారత వ్యవహారాలలో భాషా ప్రాతిపదికపై ఇప్పటికీ చాలా సంకుచితంగా వ్యవరిస్తున్నారు. వారి సంకుచితత్వానికి పంజాబులో జరిగిన హిందీ ఆందోళన తార్కాణమని చెప్పవచ్చును. అట్టి సంకుచితత్వం గల వారికి హిందీద్వారా రాజకీయ వ్యవహారాలలో ప్రాముఖ్యత ఏర్పడితే హిందీ మాట్లాడేవారికి తగినంత ప్రోత్సాహం లభించి ప్రాంతీయ భాషలు అణచివేయబడగలవని కూడా దక్షిణ దేశస్థులు సందేహిస్తున్నారు. దక్షిణాదివారు చేస్తున్న వాదంలో ఈ రెండు కారణాలు ప్రధాన స్థానాన్ని వహిస్తున్నవి. ఈ రెండు కారణాలు నిజమే అని అనుకొన్నా వాటిని సరిదిద్దుకొనడానికి తగిన ప్రయత్నం చేయడం ఉచితం గాని అసలు హిందీయే పనికిరాదనడం న్యాయంగాలేదు.

స్వతంత్ర భారత దేశంలో ఇంగ్లీషు రాజభాషగా ఉండవలెనని వాంఛించడం దేశగౌరవాన్ని ఏమాత్రం పెంపొందించే విషయంగాదు. తాత్కాలికంగా కొంతకాలం వరకు దేశపరిస్థితులనుబట్టి ఇంగ్లీషు, హిందీ రెండింటినీ సరిసమానంగా నడిపిస్తూ నెమ్మది నెమ్మదిగా ఇంగ్లీషు భాషకు బదులు ప్రాంతీయ వ్యవహారాలలో ప్రాదేశిక భాషలకు, అఖిల భారత వ్యవహారాలలో హిందీకి స్థానం ఇవ్వక తప్పదు అందుకు హిందీ, ప్రాంతీయభాషలు ఎక్కువగా వికసించి వున్నవా అనేదికూడా ఆలోచించవలసిన విషయమే. సాహిత్య దృష్టిలో భారత దేశంలోని ప్రాంతీయ భాషలన్నీ అభివృద్ధిలో వున్నవని అంగీకరించక తప్పదు. కాకపోతే విజ్ఞానము మొదలగు రంగాలలో ఆ భాషలు తగిన పదజాలము లేక వెనుకపడివున్నవి. ఇంతవరకు రాజభాషగా వ్యవరించే అవకాశం వీటికి కలుగలేదు పారిభాషిక శబ్దాలను నిర్మాణం చేసుకొని ప్రాంతీయ భాషల నన్నింటినీ తగినంత సమృద్ధంగా చేసుకొనవచ్చును. అట్టి ఏర్పాటు జరిగేవరకు ఇంగ్లీషును కూడా హిందీతోపాటు మనం అంగీకరించవచ్చును ఈ దృష్టితో పరిశీలించి చూస్తే గౌహతిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘమువారు చేసిన తీర్మానాలు చాలా ఉచితముగానే కనబడుచున్నవి పార్లమెంటరీ హిందీ సంఘం వారుకూడా దాదాపు ఇదే పద్ధతిలో తీర్మానించగలరని విశ్వసిస్తున్నాము ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వమువారు ప్రాంతీయ ప్రభుత్వములవారు హిందీ అభివృద్ధికి తమకు తోచినవిధంగా కృషి చేస్తున్నప్పటికీ ఆ కృషి చాలదని మనవి చేస్తున్నాము ఇంతకంటె ఎక్కువ ఉత్సాహంతో నిర్మాణాత్మకమైన పద్ధతిలో కేంద్రప్రభుత్వమూ ప్రాంతీయ ప్రభుత్వాలు హిందీ వ్యాప్తికి తోడ్పడినట్లయితే 1965 నాటికి హిందీని సర్వ సమృద్ధమైన భాషనుగా మనం తయారు చేసుకొనవచ్చునని మా విశ్వాసం. ఇకనైనా రాజాజీ లాంటి పెద్దలు అన్ని విషయాలను గమనించి హిందీకి వ్యతిరేకంగా తాము చేస్తున్న ప్రచారాన్ని మానివేయగలరనీ, ప్రాంతీయ భాషలు, రాజభాష వికాసానికి తగిన దోహదం కలుగజేయగలరనీ విశ్వసిస్తున్నాము.



# సంస్కృతీ కరణాలు

— డా. గిడుగు వేంకట సీతాపతి

కళ్యాణి - రూపకతాలః

(స్వీయా, మధ్యా, స్వాధీనపతికా : ప్రగల్భా)

ప కుత్రగోపయామి త్వాం - కిం కరోమి కథ్యతాం

అ. ప సుందరతరవదనం తవ - చుంబితు మతి రమణీయం.

చ-1. మా త్వం ఇత స్తతశ్చరేః - ప్రాప్తుం త్వాం వనితా స్తాః
అనుకూలసమయ మనిశం - మదవత్యో మృగయంతే
గణనా తీతాః కథ మిహ త్వాం - గోపయామి కథయామి ?
త్వా మపహర్తుం దృఢసంకల్పా - ఇతి కథయంతే.

2. బహుశో మమ నాథ ! బహి-ర్మా గమ స్త్వాం వందే
దుస్సహ మోహావేశాత్ - పశ్యంత్యో వనితా స్తా
త్వన్మధురాధరమధురస - పిపాసయాఽఽశ్లిష్య త్వాం
తవ వక్షః వక్షోజై - ర్మర్దితు ముద్యుక్తాః.

3. సానందం చారు ముద్వ - గోపాల ! ప్రాణేశ !
గురుతర మోహావేశాత్ - ఘటితాశ్లేష అవయోః
నిద్రా పరవశ సమయే - మా విశ్లేషో భూదితి
కిమహం త్వా మ్మమ - వేణ్యా బధ్నామి ?

కళ్యాణి - రూపకతాళము

ప. ఎందు దాచుకొందు నిన్ను ఏమి సేతు నేను ?

అ. ప. అందమైన నీ మోము - అయ్యారే ! ముద్దుగుల్కుచున్నది.

చ-1. అందిందు తిరుగకురా - అతివలు నీ తోడి
పొందుగోరి యీ వేళ - పొగరుచునున్నారు
ఎందరెందరని కాతు - ఎంతని నే విన్నవింతు
వందెమాడుకొన్నారట ! పట్టుకుపొయ్యెదమనుచు.

2. పలుమారు నా సామి - బయలువెళ్లకు మ్రొక్కెను
నిలుపరాని మోహమున - నిన్ను జూచి చెలులు
అలరు నీ మోవితేనె - యాని చప్పరించవలసి
కులుకు గుబ్బల రొమ్ము - గ్రుమ్మిపొయ్యేదమనుచు.

3. ముదముతో నా ముద్దు - మువ్వ గోపాలసామి
గుదికొన్న తమకమున - గూడి యిద్దరము
నిదుర పరవశమున - వదలునో కౌగిళ్ళు
పదిలముగ నా జడను - పట్టి కట్టుకొందునా ? ఎందు.

*కాంభోజి - ఆదితాళః*
(స్వీయా-మధ్యా-ప్రోషిత పతికా , నాయకః
అనుకూలః , నాయికా ముద్దిశ్య విలపతి)

ప. కీదృఙ్మోహోయ మహో దయితేః- ఈ దృగియానితి నాలం వక్తుమ్.

అ. ప. ఆవయో ర్మనో న జ్ఞాత్వా నిష్ఠుర దుర్దైవ మయే -
ఆవా మేవం వియోజయన్ క్లిశాత్యుగ్రం హేప్రియే ।

చ-1. విశ్లేషాదారభ్య దృశ్యతే - రూపం తే మన్నయనస్థ మివ
యద్యత్ కర్తుం యతతో మే - తత్ త్వత్ స్నేహకృతే
కృతమివ భాతి ।
యద్యల్లిఖితుం యతతో మే - త్వదాకృతిరివ ప్రతిభాతి
కామప్యన్యా మాహ్వాయతో మే - త్వన్నామైవ ప్రథమం
స్ఫురతి.

2. యదా తవాధర సుధాం స్మరామి - తదాన్నమపి మే న రోచతే
త్వత్ పరిరంభం చింతయతో మే - రాత్రౌ నిద్రా నలభ్యతే ।
మదన సమక్షం ప్రమాణ సహితం - సత్యం వదామి నాన్యం ధ్యాయే
కదాఽపి కథమపి యత్నే కృతేఽపి - త్వాం విస్మర్తుం
నాలం కాంతే ।

3. ఆయాహి మువ్వగోపాలేతి త-వాహ్వానం సంయోగం ధ్యాయే
దిన మేకవర్షమివ గమయితు మఠరే ! కస్తు సమీర్థః
కిం కరణీయం ?
మదన బాణ కృత బాధాం సోఢుం - నాలమహం మమ దయితే !
కీదృక్ పాపం మత్కృత మన్యైస్సహ సల్లాపః నమేరోచతే.

*కాంభోజి - ఝంపె*

ప. ఎటువంటి మోహమోకాని ఓ యెలనాగ - ఇంతంతయనగరాదే.

అ. ప. మటుమాయ దైవము మన మనసు తెలియగలేక
మనల నెడబాపెనయ్యో ! ఓ మగువా !

చ-1 కలికి ! నిన్నెడబాసినది మొదలు నీ రూపు -
కనుల గట్టినట్లుండునే
చెలియ ! నే నొకటి దలచెదనన్న నీ సేయు
చెలిమి తలపై నుండునే
సొలసి నే నేమయిన వ్రాయ నీ యాకార
శోభనమె కనుపించునే

2 అతివ ! నీ యధరామృతము దలచినంతనే - ఆహార మింపుగాదే
సతి ! నీదు కౌగిటను ప్రతిదివము నెనసిన - గతిదెలుప నిదురరాదే
మతిలోన నిన్నెకా నితరంబు నెరుగ రతి - పతియాన కల్లగాదె
సతతమును నిన్ను దలపకుండెదనన్న - క్షణమైన మరుపురాదే
ఓ చెలియా!

3. ఘనత మా మువ్వగోపాల ! రారా ! యని కలసినదే తలచెదనే
దినమొక్క యేడుగా గడప నెవ్వరి తరము? నన బోణి యేమిసేతు ?
మనసిజుని బాణవేదనల నే సైరింప మగువ ! వశముగాదే
మనము చేసిన పాపమెట్టిదో ఒరులతో - మాటాడనైన సైచనే
ఓ మగువా !

ముఖారి - మిశ్రతాలః

(స్వీయా-ప్రౌఢా-ఖండితా-అన్యగోపనా , నాయకో దృష్టః.)

ప. ద్విగుణ[1] తాంబూలాంచితాస్యో మమ సమీపం - మాగమ స్త్వమ్

అ ప. అక్షమాహం - సోఢు మేతత్ కలుషగాత్రం విజయరాఘవ!

చ-1 తత్ర మధురస సిక్త మధరం - అగ్రసత్ త్వద్రంజదధరః
తత్ర లాక్షారాగ లసితం - దర్శయసి తే ఫాలభాగమ్
మాగమ స్త్వం మమ సమీపం - నాల మహ మిహ సోఢు మేతత్
యాహి మయ్యపరాధశీల! యాహి ధూర్త! అసత్యవాదిన్!

2. తత్ర కుచయుగ మర్దిత స్త్వం - శిథిల జటయా తాడిత స్త్వం
అల్పనిద్రాకృష్ట నయనో విస్మరన్నివ వదసి కలుషమ్
తత్ర భామాయాశ్చ సదనం - వర్తతే తే గమ్యతాం
అద్య తస్యాః రమ్యహర్మ్యే - త్వం తయా సహ భణితు మర్హసి.

3. సుందరానన! విజయరాఘవ! మా మితఃపర మభిలషసి కిం?
తత్ర తస్యాః సదన మపి కిం - న ప్రయాసి ప్రేమసహితః?
కుత్ర మ్లానీకృతో హారః - కంఠమాలా కృతా జటిలా?
నూన మస్యా మాదర స్తే - తత్ ప్రసంగం తత్ర కురుతమ్.

(ముఖారి - చాపు)

ప. దొంతెర విడెముతో నాచెంతకు రాకురా నీకు నాయాన

అ. ప. ఇంతకూ నే తాళగలనా? ఏర విజయరాఘవ!

చ. 1. జిగ్గుగుల్కుమై బుక్కాతావి - చప్పరించిన వీకెమ్మోవి
విగ్గు నుదుటిలత్తుక తీవి - నీటుతోడను

1. సంయోగాత్ పూర్వం కస్తూరీమద సంయుక్త తాంబూల చర్వణం; సంయోగాంతే కర్పూరయుత తాంబూల చర్వణమ్ - సూచితమ్.

దగ్గర రాకు పదరా - దాని కేను తాళగదరా
ఎగ్గుచేసి నాయెదుటను - ఈలాగు నీవే బొంకుదురా ।

2. సిబ్బెంపు గుబ్బలపోటు - చెమ్మిరేగిన కీల్జడవేటు
మబ్బుమీరిన నిదురపాటు - మఱపుతోడను
దబ్బర లాడేవు చాల - దానిదే గదరా యాళాల ?
గబ్బితనము నీకేల ? - కలికితో మాటాడు మీవేళ.

3. చక్కని విజయరాఘవా । సామిగా నిక నన్నేలుదువా ?
ఉక్కులాడి యింటి కిక పోవా ? మక్కువతోడను ?
ఎక్కడిపీ వాడిన విరులు ? చిక్కుపడ్డవి నీకంరసరులు ?
నిక్కము దానిపై మరులు - నీవందు కక్కడికే తరులు.

*కాంభోజి - రూపకతాలః*

(స్వీయా - ప్రౌఢా విరహోత్కంఠితా నాయకః శఠః)

ప. మా ప్రలపేః - సఖి । యాహి ? కిమర్థ మయ మాయాతి ?
మాగమ ఇతి తం బ్రూహి.

అ. ప పురా తదేకయుగ మన్యజన్మ మద్య మే ప్రియే ।
కోఽయ మహో । కాఽహ మయే ।

చ. 1. అద్యాగచ్ఛతి నోచేత్ - పరేద్యు రాయాతీతి
వృథా ప్రతీక్షణేన మే - శ్వాసా ఉష్ణోపేతాః
ఉష్ణా దధరః శుష్కః - జ్యోత్స్నా ప్యాతపాయతే
శయనే క్లేశావహాఽఽహానిశాః మయానీతాః

2. దయితాఽగమనాయ మమ - నిరీక్షణే విఫలే
విషణ్ణహృదయా ప్రేమోద్వేగం న్యవారయమ్
అలం సారహీన మోహాలాపేన మే
పికనాదాంచిత మధుమాసాః వృథా గతాః.

3 మువ్వగోపాలస్య దర్శనాయ శకున మపృచ్ఛమ్
ప్రణయజనసమాగమాన్ దృష్ట్వాహం వ్యలపమ్
ఈదృక్ కాయేన తస్య ముఖం కథం పశ్యేయమ్?
అలం మమ ప్రథమ సంగమేన తేన

*కాంభోజి - త్రిస్రత్రిపుట*

ప. వదరక పోపోవే - వాడేల వచ్చీని ?
వద్దు రావద్దనవే

అ ప అది యొక యుగము వేరే జన్మ మిపుడు
అత డెవరో! నే నెవరో! ఓ చెలియా!

చ. 1. నిచ్చ నిచ్చలు నేడె వచ్చీని రేపైన - వచ్చీని అని మదిలో
ఇచ్చగా బలువేడి నిట్టూర్పులచేత ఇంతిరో పెదవులెండి
హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రులు - ఎన్నెన్నో గగిపితి
ఇక నేటి మాటలే ?

2. వలపుకాడిదె కాదా వచ్చుననుచు తెరువులు జూచి వేసారితి
నెల లెంచి యలసితి - నిలుపరాని ప్రేమ నెమ్మది నణచుకొంటి
కలకంఠ పికనాదములు మించు మధుమాస
ములు గడపితి వట్టి ముచ్చట లిక నేలే ?

3. భామరో! శకునము లడిగితి మువ్వగోపాలుడు వచ్చునాయని
కామించి నాథుల గలయు చెలుల జూచి - కరగి చింతనొందితి
రామ! రామ! ఈమేనితో నిక వాని - మోము నెటుల జూతు ?
నా మొదటి పొందే చాలు.



సమీక్ష :

# విశ్వనాథవారి మేనక కథ

— "గాండీవి"

నన్నయ్యయుఁ దిక్కన్నయు
నన్నావేశించిరి పరిణాహ మనస్సం
ఛన్నత వారలు వోయిన
తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచుఁ బోదున్.

(అవతారిక)

ఈ విశ్వనాథవారి ప్రతిజ్ఞను మనమున నిడుకొని, వాల్మీకి రచనముతోఁ దారతమ్య నిరూపణము చేయుచు మేనక కథలోని వైశిష్ట్యమును వివరించుట యీ వ్యాసోద్దేశము.

రామాయణ కల్పవృక్షమున మేనకకథ వసంతాగమన వర్ణనముతో నారంభింపఁ బడినది. స్థలాంతరములందు వలెనే యిచ్చటి యీ వర్ణనమును సందర్భోచితముగాఁ గథాగతితో మేళగింపఁబడి యుండుట ప్రశంసార్హము.

మాకందతరుశాఖికా కోకిలాలాప
కౌతూహలాకార కలనఁజేసి
తరుణ శాలీన కోమలాతపవిసారి
హృదయవాంఛా ప్రవర్త్రేమరేఖఁజేసి
శకలిత మరాళ కూజహాసంబుగా, వ
సంత నవశోభవచ్చె నప్సరసవోలె.

ఇందలి "వసంత నవశోభవచ్చె నప్సరసవోలె" అనునది యప్సరసయగు మేనక రాకను సూచించుచున్నది. "హృదయ వాంఛా ప్రవర్త్రేమ రేఖఁజేసి" అనుచోటి ప్రేమశబ్ద మా వచ్చు నప్సరస పవిత్రప్రేమ స్వరూపిణిగాఁ జిత్రింపఁబడునన్న విషయమును ద్యోతకము చేయుచున్నది.

"ఎడమమూపు గ్రహించి కుడిచేతఁ గుచమండలము గోపనముసేయ లలితరేఖ" ఇత్యాది పద్యము హావభావ విలాస విభ్రమ విధియగు మేనకా మనోహరమూర్తిని భావుకుల మనోముకురమున సాక్షాత్కరింపఁ జేయుచున్నది. తాదృశ మనోజ్ఞాకారయగు మేనకనుజూచి గాధిజుఁడు "తనగోళ్ళ దువ్వుచున్, గప్పిన యొూడు మీసలను గడ్డముఁ దర్జనిఁబాయఁ ద్రోయుచున్, విప్పగుఱొమ్ముగా నిలచి

విభ్రమవార్నిధిఁ జేరనేఁగి" నాఁడు. "కన్ తెప్పలు మూయ రిద్దరును హృత్పదనంబు కవాటముం బలెన్" అనుటచే విభ్రమవార్నిధిఁ జేరనేగిన విశ్వామిత్రుఁ డామెను నిర్నిమేష దృష్టి నవలోకింప మొదలిడెననియు, ననిమిషకాంతయగుటచే మేనక తెప్పలు మూయుటయే తటస్థింపఁదయ్యెననియు గ్రహింపనగును. "నవ్వెను మౌని యచ్చరయు నవ్వెను నవ్వులలోన నర్థమై" కౌశికుఁ డామె ననుసరించెను. వారి శృంగారము రసవంతముగను నౌచితీమంతముగను వర్ణితమైనది "కోకిల కొమ్మలోఁ గూసిన నీపచే, నన్నుఁ బిల్చితివంచు నవ్వుమౌని" "తనపాద మామె పాదము జతగాఁబెట్టి, యస్మత్పదంబు మోటని వచించు" ఇత్యాది పద్యములలోని భావము లపూర్వములు. సాధారణముగాఁ బ్రబంధములం దిట్టి పట్టులఁ బచ్చిగ సంభోగ శృంగారాదులను వర్ణించుటయే కన్పట్టును.

"ఒకనాఁడు ప్రొద్దున నాశ్రమ పురస్థతరుణ నారికేళ వలయంబులు లెక్కపెట్టి" పదేండ్లు తాను తపస్సు 'మూలఁద్రోచి' నట్లు విశ్వామిత్రుఁడు తెలిసికొన్నాఁడు. స్వర్గరక్షకై యత్నించు మహేంద్రునందును నతని యదుపాజ్ఞలలోనిదగు మేనక యందును దోషము లేదనియుఁ దన హృదయ దౌర్బల్యమునందే దోసమెల్లఁ గలదనియుఁ దలంచినాఁడు శపించుట కోపమగుననియు నది మఱి జితేంద్రియత్వ హైన్యమునకు మూలమనియు భావించినాఁడు. ఇట్టి స్థితిలో మేనక వచ్చి "మౌని మోమునుగని సర్వముం దెలిసిపో నిలువెల్ల వణంకిపోయి భీతునఁ గనుదోయివాలిచి యధోముఖియై కరయుగ్మ మంజలింగొని" నిలువఁబడినది. అప్పటి తన మనోభావములు విశ్వామిత్రుఁ డామెకు వ్యక్తీకరించినాఁడు కీడులో మేలన్నట్లు కౌశికునకు మేనక "కోరి ప్రత్యక్షమన్మథ గురువే" కాక "కోరక పరోక్ష వైరాగ్య గురువు"ను నైనది "ఏ కోకిలకూత నాదయిన గుండియ లాగదు సువ్వె బాలికా" అన్న స్థితిలోనికి విశ్వామిత్రుఁడు వచ్చినాఁడు. .

పుష్కర తీర్థమున స్నానముచేయు మేనకను విలోకించి కామ పరవశుఁడై విశ్వామిత్రుఁ డిట్లనెనని వాల్మీకి రచనము.

శ్లో. అప్సర స్స్వాగతం తేస్తు వసచేహ మమాశ్రమే
అనుగృహ్ణీష్వ భద్రంతే మదనేన సుమోహితమ్.

ఇట్లు ముని పలుకగా నామె యట వసించినట్లు "ఇత్యుక్తా సావరారోహా తత్ర వా సమథాకరోత్" అని చెప్పఁబడి యున్నది. ఇట్లే పదేండ్లు దాటిన పిదప విశ్వామిత్రుఁడు పశ్చాత్తప్తుఁడై మేనకను మధుర వాక్యములతోఁ బరిత్యజించినట్లు

"మేనకాం మధురై ర్వాక్యై ర్విసృజ్య కుశికాత్మజః" అనిమాత్రమే చెప్పబడినది

ఈ విషయములను విస్తరించి మనోవృత్తి వివరణ కౌశలమును విశ్వనాథ వారు ప్రకటించిరి. రంగనాథ రామాయణాదులందు వాల్మీకి రచనమే యనుసరింప బడుటచే విస్తరభీతినిట వాని నుదాహరింపక విడచుచున్నాను. (రంగనా 70 పుట యూ. ము. భాస్కర బాల. 662-663 వ.)

"ముదిత మునిముని నవ్వుతో మోమువంప" "చంచలనేత్ర యిట్లు తన సంగతి కొప్పుటఁగాంచి మౌనితాఁ గొంచక పట్టెఁ బైచెఱఁగు" అని కళా పూర్ణోదయమున రంభా మణికంధర సమావేశ సందర్భమునఁ గలదు. "నవ్వెను మౌని యచ్చరయు నవ్వెను నవ్వులలోన నర్థమై" అను పద్యపాదమునకీ కళా పూర్ణోదయ సందర్భమే దోహదమయ్యెనా ? యని యాలోచింపవలసి యున్నది. "సహృదయాః ప్రమాణమ్"

ఈ కథలో ప్రముఖస్థానము నాక్రమించు విషయము మేనకా విశ్వామిత్రుల ప్రణయ చిత్రణము అత్యల్ప సంభాషణాదుల ద్వారమునఁ బాత్రల శీలము మున్నగు వానిని స్ఫురింపఁజేయుట యలంతులకు శక్యముకాదు.

పనియేమో దేవతలది  
వనితా కూలికినిగాని వచ్చినయట్ల  
య్యును నెదఁద లోతులిచ్చిన  
వినునేల శపింపవలయునే మధుమూర్తీ

ఈ పద్యమువల్ల దేవకార్యార్థమై తపోభంగ దృష్టితో మేనక వచ్చినను నామె "ఎదఁద లోతులిచ్చిన మధుమూర్తి"గా వర్తించినట్లు తెల్లమగు చున్నది.

ఓసీ ! యచ్చర ! నీవు భీతువదెదేలో తన్వి ! నీయందు నా  
దోసంబున్నది గర్భరూపముగ. నీ దోసంబు త్రేతాంత మా  
యాసంబైనను రక్షసేయఁగదె మేనా ! కణ్వుఁడన్ మౌని వ  
న్యాసీమన్ విడుమీ ? శపించుదునె బేలా ! నాదు దోసానకున్.

ఈ పద్యమున విశ్వామిత్రుఁడు మేనకను గర్భరక్షణకు నియోగించి, శిశువును గణ్వాశ్రమ సీమను విడుపుమని చెప్పినట్లు గలదు.

అవాల్మీకములగు నీ విషయములను సమ్యక్పరిశీలనము చేసిన మేనకా విశ్వామిత్రుల పదేండ్లు పవిత్ర దాంపత్యము నెరపినట్లు స్పష్టపడును. "ప్రీ ప్రజా ర్థంబు కావుట శిష్ట వేద మార్గము." కావున విశ్వామిత్రునివలనఁ బ్రజాపతియైన

పవిత్ర చరిత్రగా మేనక చిత్రింపఁబడుట గమనార్హము. మేనకా ప్రణయ చిత్రణ మున కనుకూలములగు నొండు రెం డవాల్మీక విషయము లనంతరకథయందును జేర్పఁబడెను.

రంభను మహేంద్రుఁడు కౌశికుని తపో విఘ్నమునకుఁ బంపునపు డామె ముని కోపించునని భయపడినట్లు వాల్మీకి రచనము,

"అయం సురపతే ఘోరో విశ్వామిత్రో మహామునిః
ఘోరముత్సృజతే క్రోధం మయి దేవ న సంశయః
తతోహి మే భయందేవ ప్రసాదంకర్తు మర్హసి"

ఇట్లే రంగనాథ రామాయణమున "నాకేశకోపించి నన్ను శపించుఁ, నాకౌశికుఁడు" అని రంభ యన్నట్లు కలదు "నన్ను శపించుఁ గిన్క న. మ్మునితెరు వేమ పోవెఱతు మూర్ఖుఁడతం డని వల్క" అని భాస్కర రామాయణము. ఇట రంభ విశ్వామిత్రుని మూర్ఖుఁడనుట నముచితమని తోఁచుకున్నది.

రామాయణ కల్పవృక్షమున రంభ "ఇది మేనకకును నీర్ష్యాపద మగునో" అనియును నన్నట్లుకలదు. ఇట్లనుటకుఁ గారణమూహ్యము. మేనక దేవలోక మున కేగిన పిమ్మట రంభాదులతో విశ్వామిత్ర తపోభంగ వృత్తాంతము చెప్పి యుండును. ఆ చెప్పు తీరులో నామె యతనియెడ స్నిగ్ధయైన స్ఫూర్తి యుండి యుండును. "మేనా! నవ్వకు నువ్వె నాదు కథ నామీ యప్సరః పాళితోఁగానీ చెప్పి" అను విశ్వామిత్రుని వాక్య మామె తన సఖులతో (రంభాదులతో) నీ వృత్తము చెప్పుననుట కుపస్కారకము "నలకూబర విడు విడరా" అను మణి కంధర తపోవిఘ్న కారిణియగు రంభా ప్రవర్తనము వంటిదికాక యిట మేనక వర్తనము పవిత్ర ప్రణయభావ భాసురముగ నుండుటచేతనే రంభ యిట్లు శంకించె ననుట సందర్భ పడుచున్నదని గ్రహింపవలయును.

"మునులను ద్రిదశ సతుల జంట గుదుల గుదులుగ గట్టిరచె వెట్టి గుండియదానా" అని రంభను సమాధాన పఱచుట కార్యసాధనకై తత్పరుఁడగు నింద్రునియెడ సహజమే. ఇట్లింద్రునిచే సమాధాన పఱుపఁబడి తపోభంగార్థ మేగిన రంభ శప్తయైన మఱికొంత కాలమునకు విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియైనాడు. అప్పుడు మేనక ప్రకటించిన యానందము తత్ప్రణయినీత్వ చిత్రణము నత్యంత పుష్టము చేయుచున్నది

కం. అప్సరసయైన మేనక
లిప్సా మధుమూర్తి కాకలీకలకేకా
లీప్సా కీర్తనఁ బాడెఁ గ
కుప్పమ్మార్జనము భావ కూలంకషమున్.

ఇందలి 'లిప్సా మధుమూర్తి' అనునది "నిను నేల శపింపవలయునే మధుమూర్తీ" అను పద్యపాదమును స్మరింపఁజేసి తద్ద్వారమున నామె పవిత్ర ప్రేమభావుకుల మనోవీథిని విహరింపఁజేయుచున్నది

అరయనరయ నీ విశ్వనాథవారి మేనకా పాత్రచిత్రణమునకు నన్నయ్యగారి మేనకాపాత్ర చిత్రణమే హస్తావలంబ మొసఁగి యుండునని తోఁచుచున్నది. "ఊర్వశి పూర్వచిత్తి, సహజన్య, మేనక, విశ్వాచి, ఘృతాచి" యను నార్వురు నప్సరసలలో శ్రేష్ఠురాండ్రనియు నందు మేనక విశ్వామిత్రునివలనఁ దన్నుఁ గనె ననియు శకుంతల దుష్యంతునితోఁ జెప్పినట్లు వ్యాసభారతమున నుండఁగా (1-68 అధ్యా. 67-69 శ్లో ) నన్నయ్య యీరీతిని జెప్పించినాఁడు

క. క్షత్రియ ఋషియగు విశ్వా
మిత్రునకుఁ బవిత్రయైన మేనకకున్ స
త్పుత్రినయి బొంకువలుకఁగ
ధాత్రీతలనాథ యంత ధర్మేతరనే ?

ఇందు "పవిత్రయైన మేనకకున్" అనునది గమనింపవలసినది. 'షడే వాప్సరసాం వరాః' అని వ్యాసభారతము. నన్నయ్యగారి యీ పద్యము క్షత్రియ ఋషియగు విశ్వామిత్రుఁడును బవిత్రయగు మేనకయు శకుంతలవంటి సత్పుత్రిని గన్న పుణ్యదంపతులన్న విషయమును విశదీకరించుచున్నది. మేనకా పవిత్ర చరిత్రమునకుఁ గుత్సితాక్షేపణములు నైతము సమంజసములు కావని తలంచి కాఁబోలు నన్నయ మూలమునందలి దుష్యంతకృత మేనకా ప్రభృతుల నిరసనము పరిత్యజించినాఁడు.

శ్లో. మేనకానిరనుక్రోశా బంధకీ జననీ తవ
యయా హిమవతః పృష్ఠే నిర్మాల్యేవ ప్రవేరితా
నచాపి నిరనుక్రోశః క్షత్రయోనిః పితా తవ
విశ్వామిత్రో బ్రాహ్మణత్వే లబ్ధః కామపరాయణః
మేనకాప్సరసాం శ్రేష్ఠా మహర్షీణాంచ తే పితా

తయోరపత్యం కస్మాత్వం పుంశ్చలీవాభిధాస్యసి
అశ్రద్ధేయ మిదం వాక్యం కథయంతీ సలజ్జసే
విశేషతో మత్సకాశే దుష్టతాపసి గమ్యతామ్
సునికృష్టాచ యోనిస్తే పుంశ్చలీ ప్రతిభాసి మే
యదృచ్ఛయా కామరాగా జాతా మేనకయాహ్యసి.

ఈరీతి దుష్యంతుని వాక్యములు విడచి మేనక పవిత్ర యనుటలో విప్రతి పత్తియే లేనట్లు నన్నయ్యచూపినాఁడు ఈ నన్నయ్య పోయిన తెన్నున విశ్వనాథ వారు మెఱుగుఁలను దీర్చి దిద్దినారు.

ఇట వేఱొక విషయము ను బరిశీలింపనగును. ఉత్తరరామాయణములోఁ గంకంటి పాపరాజు రంభారావణ సంవాద ఘట్టమును మనోహరమగు సూక్తి ప్రత్యుక్తి నైపుణ్యముతో నడపినను నామె వేశ్యాత్వమును దొలఁగింపలేదు. విర్వచనోత్తర రామాయణమునఁ దిక్కన యామె వేశ్యాత్వమును దొలఁగించు టయేకాక దేవత్వమును బ్రదర్శించుచు నామెనొక యమృత ప్రణయస్వరూపిణిగాఁ జిత్రించెనని యొక సిద్ధాంతము.

నావుడు నమ్మృగేక్షణ మనంబున రోయుచు నేను లంజియం
గావుడు వానితోడి తమకంబది లంజియగాదు ప్రేమ వ
ద్భావ మెఱుంగవైతి గుణభాగివిపో వినుఁ గోర్కి పెందునే
నీవచనంబు తప్పకట నీళ్ళుల పట్టున నేయి మందొకో

ఈ విర్వచనోత్తర రామాయణ పద్యమే యట్టి సిద్ధాంతమునకు హేతువు కానో పును ఈ తిక్కన మార్గము కూడఁ బ్రకృత మేనకా పాత్ర చిత్రణమున విశ్వ నాథ వారికి దోహద మిచ్చియుండవచ్చును.

కథాంతమున 'నీరంతర్గ్రథితా బహుంధారూపిత సూక్ష్మతర కథాంశులు మున్మీ' అని ఋషియు వక్తయునగు శతానందుని ప్రశంసకలదు. ద్రష్టయన, విచిత్రమైన వస్తువుల ధర్మాంశము వెఱుఁగువాఁడు.

నానృషిః కవిరిత్యుక్త మృషిశ్చకిల దర్శనాత్
విచిత్రభావ ధర్మాంశ తత్త్వప్రఖ్యాద దర్శనమ్.

(నరస. వ్యాఖ్యనుండి)

[తరువాయి 18 వ పేజీలో]

*గేయం*

# విజ్ఞాన విహంగం

— శ్రీ ఉండేల మాలకొండారెడ్డి

విజ్ఞాన విహంగమదే
విజృంభించి యెగసింది
భూలోకం ఱెక్కల పెను
గాలికి కంపించుతోంది

మానవ మస్తిష్కమ్ముల
మహాగాధ కుహరాల్లో
విద్యుద్వల్లీ సమిధల
విఱిచి తెచ్చి గూడుకట్టి
పరమాణు గణమ్ము పొదిగి
ప్రళయశక్తి సృష్టించిన
విజ్ఞాన విహంగమదే
విజృంభించి యెగసింది
భూలోకం ఱెక్కలపెను
గాలికి కంపించుతోంది.

"సహారా" యెడారిలోని
సైకతాలు చిమ్ముతోంది
జ్వాలా ముఖిపై "లావా"
జ్వాలలు కబళించుతోంది
మందరమటు సంద్రమెల్ల
మథియించి కుదించుతోంది
కాకోలం పీయూషం
ఏకం కావించుతోంది.

"స్పుట్నిక్కులు" దాని కండ్లు
చుక్కలు దూరంపు చెలులు
చందురులో జింకతోడి
చెలగాటం దాని కెపుడు
ఉల్కా శకలమ్ము లట్టె
ఉప్పుని పైకూదివేయు
శూన్యాకాశం వెలుపల
సూర్యుని ఢీకొట్టబోవు
నవగ్రహాల దాపులలో
నరవాసన పసికట్టును.

ఉదజని "బాంబు"లు దానికి
ఒదవిన రక్కసి పిల్లలు
"రాకెట్టు"లు విచ్చుకొన్న
రక్కెస జంపాల గోళ్లు
గోళ్ళమధ్య చిక్కిన్రేలు
కోట్ల ప్రజా కంఠమ్ములు
శరణని జీమూతవాహ
సంస్మరణం చేస్తున్నవి

---

విశ్వనాథవారి మేనక కథ (16 వ పేజీనుండి)

**అని భట్టతౌతుఁడు చెప్పియున్నాడు ఈ యంతర్దృష్టత్వము, బహుధారూపిత సూక్ష్మతర కథాంశత్వము మేనకా విశ్వామిత్ర సమాగ మాదులందును మేనకా పాత్ర చిత్రణమునందును బరమావధిని బొందుటయే యీ మేనక కథలోని వైశిష్ట్యము. "అన్ని యంశమ్ములను జెప్పినట్టి తీరు వేఱు మేనక కథ తీరువేఱు" అనుట సర్వథా సార్థకము.**

నాటిక :

# పరాజితుడు

— "భారతి"

— ఇందలి పాత్రలు —

★ కుమార్ ★ నాగభూషణం ★ శ్రీమన్నారాయణ

★ కృష్ణమూర్తి ★ సత్యమూర్తి

(అది క్లబ్ హాలంతా కుర్చీలతోను, డ్రాయర్లతోను నిండివుంటుంది రేడియోనుంచి అస్తవ్యస్తంగా మాటలు వినిపిస్తూంటాయి టేబిల్ టెన్నిస్ బోర్డుమీద బేట్లు బాలు పడుంటాయి ఇంకో డ్రాయరుమీద నాలుగుసెట్ల పేకలు చిందరవందరగా పడుంటాయి ఒక కుర్చీలో చార్లమతక బనీను, చిరిగిపోయిన ఖద్దరు పంచె (మాసినవి) తోను, గెడ్డం పెరిగిన ముప్పయి సంవత్సరాల యువకుడు జీర్ణించిన నేత్రాలతో, గత జీవితంలో ఏదో పోగొట్టుకున్న వానిలా, ఎవరిరాకకోసమో ఎదురుచూస్తూ, బీడీ కాలుస్తూ, ఆర్పుతూ, మళ్ళీ కాలుస్తూ, బిక్క చూపులు చూస్తూ, అపుడపుడు విచారంగా ఏడుస్తూంటాడు 'నిర్మలా' 'నిర్మలా' అంటూ వికటంగా నవ్వుతూంటాడు

అది ఆదివారం క్లబ్ ప్రక్కన ప్రశాంతంగా వుంటుంది లోపలగదుల్లో మాత్రం బల్లలు సర్దే శబ్దం విన్పిస్తూంటుంది)

సమయం రాత్రి 10 58 గంటల కాలం

కుమార్ అదిగో కాలవాహిని, కరాలు చాచి రమ్మంటుంది (పిచ్చిగా)... హు...హు...హు, ఎందుకు రమ్మనదు తాను మహారాణి! నేనే నేమిటి అంత రాజు కానివాడిని!! .. ప్రకృతట ప్రకృతి... వికృతి రూపంలో గంతులేస్తుందదిగో... నిర్మలా... నిర్మలా... నీలో వున్న నిర్మలత్వమే నిన్ను నిలువునా చీల్చింది కరుకుగా ప్రవర్తించమంటే మరీ చురుకై పోతుందనేదానివి అంత శాంతం కొరగాదంటే గాంధీ మహాత్మునికి లేదా అతనేమైనా పాడయ్యాడా అనేదానివి...నిర్మలా... కాలరాత్రికి అంకితమైపోయావా? సంఘంలో వున్న ధనోన్మత్తుల వినోదపు ఆటలలో విరగడై పోయావా??... ఇది కౌను హాలట... కౌనుహాలు ఎంతమంది వేలమీద పోగొట్టుకుంటున్నారు...ఏమిటి?... వేలు... ఎన్ని సీసాలు ఖాళీఅవుతున్నాయి... ఇక్కడకొచ్చేవాళ్ళంతా

నీతి నిజాయితీ ఉన్నవాళ్ళమనుకుంటారు ఎన్ని ప్రచ్ఛన్న వేషాలు వేసి ఎందరిని తైతెక్కలాడిస్తున్నారో ?...నిర్మలా... దోషరోషపూరితంగా ప్రవర్తించీప్రవర్తించని విధంగా ప్రవర్తించి, నల్లకోట్లని ఆదుకుంటారు. అదీఒక నిజాయితీయేకోసం... నిజాయితీ అట...నిజాయితీ! జాతీయత చచ్చింతర్వాత మజా ఏమిటో స్వార్థపు పీనుగులికి తెలిస్తేగా! మజా తేల్తే సజలంలానన్నా వుందురేమో ? నీతి నియమాలు ఒక్కుమ్మడిగా నానబెట్టి వానలా కురిపిస్తున్నామంటారు తెరవెనుక భాగోతాలకు గోతులు చాలవు ఎన్ని అమాయక జీవితాలు అంకురార్పణై సమర్పణ రూపంలో సమసిపోతున్నాయి "మనస్సులు వికలంగా క్షోభించి, దాని తరువాత హాయిగా ముద్దాడి, ఆలింగనం యిదిగో అంటే కలిసివచ్చేది కనకమయినా వీడి, పెనుతుఫానులోనైనా ప్రయాణిస్తాడుగాని కాంచన మని కాలెనక్కిడి బంధనంలో బందీ అవుతాడా ?"... నిర్మలా... నీ నిర్మలత్వపు చూపుల్లో వుండే తీక్షణత తూణీరపు మొనలోవుండే ప్రశాంతత అనేవారు వారంతా అందుకేనా ? అర్థంచేసుకోలేక దిక్కులు వెతికేవాణ్ని... నిర్మలా... మర్మంతెలియక ధర్మంగా వాళ్ళ బాహు పంజరాల్లో బందీవై వాళ్ళ జ్వాలల ప్రవాళములకు అంకితమై పోయావా ?...(ఏడుస్తూ) ఏంచేయను... నిస్సహాయుణ్ని... వాళ్ళపై పగసాధించి నిన్ను పొందుదామంటే దారేది... ఇక నాకు మిగిలింది గోదారి మాత్రమే ?... అక్కడైనా నీ ప్రశాంత పాన్పుపై నాకు చోటిస్తావా! కలుషాత్ములు—ఆత్మలు. ఇంత తనివితీరని విషాదాన్ని సృష్టిస్తాయనుకోలేదు తెలిస్తే, వాళ్లు దీర్ఘంగా పురమాయించే పనుల్లో తలొగ్గుతానా ? నిన్ను వీడి నిముషమైన మసలలేని నా అంతరాత్మ ఎంతగా క్షోభించి విలపించిందో నీకు తెలియనిదా ? (విచారంగా) ఆఖరికి వాళ్ళ ప్రవాహపు సుడిలో నీ పాదాలుంచి నీ బాధ్యత తీర్చు కున్నావేగాని నా గోడు ఏమైనా యోచించావా ?... నిర్మలా... నిర్మలా...

(గడియారం 11 గంటలు కొడ్తుంది)

ఎన్ని ప్రచ్ఛన్న వేషాలనైనా విచ్ఛిన్నరూపం దాల్చినా వాటిని తిరుగు మరుగు మరుగుతిరుగు సృష్టించి పుష్టిగాచేసి తమపేరు చక్కగా నిలుపుకుని కులుకుతాయి ఈ నల్లకోటులు.

( మోటారుసైకిలు వచ్చే శబ్దం అతి జోరుగా వినవస్తుంది )

నల్లకోటుల్లోనేవుంది ఘోరమంతానూ అన్నాడందుకే ఆ చౌదరి ఎక్కడో తినుంటాడు తియ్యని షాక్ లేకపోతే యీ నల్లకోటుధరించి ప్లీడర్ననుకుని తిరిగే యీ నాగభూషణం చేసిందేమిటి ?

( బూట్ల శబ్దం టక్ టక్ వినిపిస్తుంది )

నాగభూషణం (బూట్ల శబ్దందూరమవుతుంది) ఒరేయ్ ! ..సుబ్బారావూ !... ఎక్కడకు పోయావురా . యూస్‌లెస్ ఫెలోలు ఎంతమందుంటే ఏం లాభం— అవసరం వచ్చిన వా డొక్కడు లేకపోయాక .. (బల్లలు లాగే శబ్దం కీచుమంటూ వినిపిస్తుంది) అబ్బబ్బ ఇది కౌనుహాలుగాదు, కుక్కలు రాగాలుతీసే కుక్కలపేట .. ఛీ...ఛీ (కోపంగా) ఒరేయ్ సుబ్బారావ్ ! సుబ్బారావ్ !! — ఎక్కడ ఏడుస్తున్నావురా......

కుమార్ (ప్రశాంత వదనమూర్తిలా, కాలి ఆరిపోయిన బీడీ నోట్లో పెట్టుకుని వచ్చి) ఏమండి అంత కోప్పడుతున్నారు- ఏమండీ సెలవు !

నాగ (ఎగాదిగా చూసి) ఎవరు నీవు ?

కుమార్ (వికటాట్టహాసంగా నవ్వి) నన్ను తెలియదూ ! నేను, నేనా ! ఎవరయితే ఏం లెండి ! దేనికండి పిల్చారు ?

నాగ నిన్నెవరు పిల్చారు ఎవరు నీవు- ఇది కౌనుహాలు నీలాటివాళ్ల రావటానికి వీల్లేదు తెలుసునా ?

కుమార్ తెలియకేమండి, తెలుసు— మీరు పిలిచేరని, ఎందుకో తెలుసుకుందామని (మీదకొస్తుంటాడు)

నాగ ఏమిటోయ్ నీకా పొగరు మీదమీద కొస్తున్నావే ! ఫోవోయ్ నిన్నెవరూ పిలవలేదు- వెళ్ళు సుబ్బారావూ వీ డెవడో చూడరా మీదకు వస్తున్నాడు

కుమార్ అంతేనాండి ? మీ రేదో నల్లకోటు కట్టుకుని ప్లీడర్‌లా కనిపిస్తూంటేను ! ... !

నాగ ఏదో ప్లీడర్ లా కనపడ్డ మేమిటి ?

కుమార్ చెట్టుక్రింద ప్లీడరు కాదులెండి- వట్టిగొట్టించే ప్లీడరిలెండి

నాగ · ఏయ్- ఏమిటోయ్ ఆ పొగరు- ఒరేయ్ సుబ్బారావూ ఎక్కడ చచ్చావురా,... పోనీ నీ వైనా చావరా సూర్యం...

కుమార్ వాళ్ళుదేనికండి ? నే మన్నానుగా— (మీది కొస్తుంటాడు)

నాగ ఏమిటోయ్ నీకా చనువు— మరీ మీదికొస్తున్నావు నా పేరెవరో తెలుసా ?

కుమార్ తెలియకేమండీ తెలుసు బాగా తెలుసు ఏదీ ఓసారి అగ్గిపెట్టిస్తారూ వెధవబీడీ మధ్యలోనే ఆరిపోయింది కొనకంటూ కాలకుండా

నాగ నాపేరు తెలుసుండేనా యీ వేషాలు—

కుమార్ తెలియకేమండీ—పచ్చగా జరిగే జీవితాలు అంతం చూడకుండానే నరికే మీలాటి గొడ్డలి జీవితాలపేర్లు తెలుసుకోకపోతే వృధాకదాండి మరి—

నాగ ఏమిటోయ్ ఆ వాగుడు ఏం వాగుతున్నావో తెలుసా వళ్ళు రాలతాయి జాగ్రత్త..

కుమార్ నా వళ్లురాలితే మీకు డబ్బేమీ రాలదండోయ్ ప్లీడరుగారూ ! మీ అమ్మాయి పౌడరు ఖర్చుకూడా రాదండోయ్ ! !

నాగ ఏయ్ నీకనోయ్ చెప్పేది ఛీ గెటౌట్, చిన్న పెద్ద మంచి చెడ్డ లేదిక యూస్‌లెస్ ఫెలోస్

కుమార్ అవునుమరి సలహాల పేరుతో మీరు మా ఉపయోగపడుతున్నారు. ప్రశాంతంగా జీవించే స్వర్గసీమలో విషపురుగులా ప్రవేశించి

నాగ ఏమిరా రాస్కెల్ (చెంపమీద ఛెళ్ మనిపిస్తాడు) అతివాగుడు ఘనమ్మనుకుంటున్నావా ?

కుమార్ నాచంప ఛళ్ మనిపించారుగాని హృదయం ఎంత క్షోభించిందో తెలుసుకోలేని పశుప్రాయుడవు నాగభూషణంగారూ..

నాగ నాపేరూ నా ప్రతిభా తెలుసుండే ప్రేలుతున్నా వన్నమాట అర్థం కాని ప్రేలాపన తగిన శాస్తి జరిగిందాగా ఇకనయినా వెడతావా, గెంటించమంటావా ?

కుమార్ అవునుమరి గెంటిస్తావు. అంతగా కాకపోతే మట్టికరిపిస్తావు నీకేం ? నీ ప్రాణస్నేహితు లున్నారుగా, సినీమావాలు కృష్ణమూర్తి, సారాబట్టీ శ్రీమన్నారాయణ, మున్సబు సత్యమూర్తిను నీ కేమయ్యా— ఎన్ని కొంపలయినా కూలుస్తావు పచ్చని కాపురాల్లో ఆరనిచిచ్చు అంత రద్దంగా పెట్టి మంటచేసి మిన్నుముట్టిస్తావు అథమూ, శుభమూ తెలియని అబలల్ని వురికంబాని కెక్కించేలా నీ అమూల్యమయిన సలహాల నిచ్చి ప్రాణాలు నిలువునా తీయిస్తావు అంతా నీ తప్పు కాదులే. ఈ

ఊరికి పెద్ద ఎడ్వైజరువని వున్న పేరు మహిమ. నీ అనుయాయులు ఆర్థిక బలమూను

నాగ అయిందా వాగుడు, ఇంకా మిగిలిందా? నీ మితిమీరిన వాగుడుతో నన్ను మభ్యపెట్టి ఏదో కొట్టేద్దామని చూస్తున్నావే, సాగుతుందను కున్నావా ఓరి రోగ్...

కుమార్ ఎలా సాగుతుంది నిర్మలలాటి నిండు జవ్వనుల యవ్వనం నిలువునా కూల్చేయటం తెలుసుకొని నీ యంతటి కుటిల స్వభావం కాదు నాది

నాగ ఏం . వూరుకున్నాననా పై పైకి పోతున్నావు నిర్మల జీవితాన్ని నేనేం చేశాను, అయినా ఎవరు నీవు—

కుమార్ నే నెవరో కావలసివచ్చిందే!... నేనా.. (వికటంగా నవ్వి) దానికి మంగళసూత్రం కట్టి మొగుణ్ణనిపించుకున్న కుమార్‌ని తెలుసా!

నాగ (నిశ్చేష్టుడై) కుమార్. . నీ వా నీ వా ?

కుమార్ ఆ... నేనే... పిలూ సుబ్బారావును నేను లేకుండగా, నల్లమందు దొంగచాటుగా అమ్ముతున్నానని, మా యిల్లు సోదాచేయించి, తాళం వేసివున్న నా స్వంతగదిని పగులకొట్టి, పీలు చూచుకుని 'నా' అన్న వాళ్లు ఇక మిగిలిలేని నా భార్యను కేసుపేరుపెట్టి అంతకుముందే శ్రీమన్నారాయణ తెచ్చిన నల్లమందు ప్యాకెట్లు సాక్ష్యం చూపించి, నా భార్యను అరెస్టు చేసినట్టు చేసి తీసుకువెళ్ళి, యీ 'వినోదపురాయు' ళ్ళయిన శ్రీమన్నారాయణుడు, అతని సహచరుడు కృష్ణమూర్తి నా భార్యను కేసు తీయించేస్తామని మభ్యపెట్టి దాన్ని సాంతం పాడుచేసి, పదిహేనురోజులు వూపిరి సలపకుండా సముద్రానికి నాలుగుఫర్లాంగుల్లో వున్న వాళ్ళ స్వంతమేడలోపెట్టి నానాహింసల పాల్జేసి, దాని అంతర క్షోభనయినా గుర్తించకుండా నిలువునా పాడుచేశారే! నేను తిరిగివచ్చి దానిశీలం శంకిస్తానని ఆత్మలో అర్థంకాని ఆవేదనతో అలమటించి, ఆఖ రికి తన పవిత్రతకు తార్కాణంగా నూతిలోపడి ప్రాణాలు విడిస్తే, తిరిగివచ్చిన నాకు తెలిశాక తమందరికి ముప్పు వాటిల్లుతుందని శ్రీమ న్నారాయణుడు ఆ కృష్ణమూర్తి ఆడిన ఆటలు, పాడిన పాటలు, కళ్లారాగాంచి, వీనులవిందుగా విని వాళ్ళు నీ కిచ్చే వినోద విజ్ఞానా లలో వాళ్ళు చెప్పినట్టే విని 'గంగిరెద్దు'లా తలూపి, ఆఖరికి నాభార్య

నిర్మలతో నేనే పెద్ద ఘర్షణపడి, నాతో తిరుగుతున్న నా ప్రాణ స్నేహితుడయిన భాస్కరుతో తిరుగుతుందని అనుమానించి, దానితో వివాదం పెంచుకున్నానని, దాని జీవితాన్ని పాడుచేసిందిగాక, భాస్కరునిగూడ దీనిలో గుచ్చి, అందుమీదట ఆమెను నేనే హతమార్చానని, నూతిలో పడేశానని తప్పుడు సాక్ష్యాలు అందజేసి నాకు జైలుశిక్ష ప్రసాదించేలా చేశావు... గుర్తులేదేంపాపం... ఎలా గుర్తుంటుంది? వాళ్ళ వినోదపు ఆటల్లో ప్రొద్దే మర్చిపోతున్నావుమరి ఏం మాట్లాడవు (కత్తి తీస్తాడు)

నాగ నాదాతప్పు . అదేమిటి ఆ కత్తి తీశావెందుకు—

కుమార్ ఆర్థిక మదాంధకారంలో కళ్ళుగానకుండా యిలాంటివిచేస్తే నాలాంటి ఎంతమంది ఆశలు అడియాసలౌతాయ్! దీనితో నిన్ను కడతేరిస్తే నా మనస్సుకూ శాంతి లభిస్తుంది ఇక నీమూలంగ అల్లరిపాలుకాదలచివున్న సంసారాలు చక్కబడి చల్లగానన్నా వుంటాయి

నాగ నన్ను హతమారిస్తే నీకేమొస్తుంది నేను నీకేమీ అన్యాయం చేయలేదే అంతా వాళ్ళదే! నా దంతా నేను చూసిన ప్రకారం చెప్పటమే. .

కుమార్ వాదీ అంతే! అన్యాయంగా చేయిదూర్చి, అఘమూ, శుభమూ తెలియని వారి గొంతులు పిసిగి పారేసే నీలాటి వారి ప్రాణాలు యీ భూమ్మీద వుండకుండా చేయటమే నా విధి ఏం చేయను? నీకు భగవంతుడు అలా వ్రాశాడు— నా కిలా వ్రాశాడు ఏం చేస్తాం... ఎంత నీవు క్లబ్ సెక్రటరీవయితే మాత్రం

నాగ కుమార్, నాకేమీ తెలియదు. అంతా శ్రీమన్నారాయణుడు, కృష్ణమూర్తి ఆడించేరు, అంతే! అయినా ఎప్పు డొచ్చేవు జైలునుంచి? జైలుకు వెళ్ళేటప్పుడు నీ ముఖం చూస్తే చాలా జాలేసింది, ఏంచేయను విధి విషవు విన్యాసము అదీ కాకుండా వాళ్ళు నీ గురించి చెప్పిన కథాసంవిధానం కూడ అలానే వుంది

కుమార్ అనునయమైన మాటలుచెపితే విడిచిపెడతాననా— అది జరుగదులే! అడిగేవు కాబట్టి నేను నిన్న నేవచ్చేలే— నిన్ను చంపితే నేను మళ్ళీ జైలుకెడతానని నాకు తెలుసులే! ఒకసారి రుచి చూపించావుగా!. అయినా ఇక్కడ నాకింకెవరున్నారని .. (విచారంగా) నా నిర్మల నేల

రాలిపోయిందిగా ? నా నిర్మల నా కళ్ళముందు లేనిదానికి నీవుమాత్రం దేనికి (కత్తి పై కెత్తుతాడు)—

నాగ ఆ కత్తి పదునుకు నన్ను ఎరగా వేసి నీ కక్ష తీర్చుకుంటావు— నీ దాహం తీరుతుందా ? నా భార్యాపిల్లలు గోడుగోడున ఘోషిస్తారు కుమార్— చాలమంది పిల్లలు గలవాణ్ని — ఒక్కళ్ళూ ఇంకా చేతికందలేదు.

కుమార్ నీ భార్యాపిల్లలు కావలసివచ్చేరే ? ఆనాడు నా భార్యను నేను అనుమానించి. నిందించి, నిలదీసి, రొక్కించి అడిగి 'పతిత' క్రింద జమ కట్టి నిలువునా ప్రాణంతీసి నూతి నీళ్ళకు సమర్పించానని బల్లగుద్ది చెప్పే వే— అదే నోటితో నీ భార్యారత్నం విలపిస్తుందని అంటున్నావా? నాకు లేదనుకున్నావా నీలాటి మమకారం నా భార్యమీద ఏం మాట్లాడవు ముఖం వేలాడవేసేవే . నిర్మలా . కలుపాత్ముల కారిన్యానికి ఆహారంగా అయిపోయావా ? నిన్ను హతమార్చి తీరుతాను.

నాగ కుమార్ నా భార్య నా భార్య . . నా భార్య మంగళసూత్రం కాపాడు కుమార్. నీ భార్య ఏనాడో పోయింది. పోయింది తిరిగి రాదుగా నా భార్య మాంగళ్యం కుమార్ ..

కుమార్ భార్య మాంగళ్యం భార్య మాంగళ్యం. నిర్మలా నిర్మలా మాంగళ్యం చాల ప్రభావమైందనేదానివి దానిలో అంతర్యం అర్థమయ్యేదిగాదు అదా . అదా పిరికివాడా (పశ్చాత్తాపపడి) నీలా అనవసర అన్యాయాలుచేసి పాపాలకు అధిగమించి ఆ స్థానం ఆక్రమించను ఫో నిన్ను విడిచిపెడ్తున్నాను ఫో ఫో ఇక క్లబ్ ముఖం చూడకు ఫో

నాగ కుమార్ ! కుమార్ నిజమేనా ! (వెళ్ళిపోతాడు)

కుమార్ ! నీలాగ నాకు నాలుకలులేవు ఫో

(ఆలయంనుంచి గంటారావం వినిపిస్తుంది)

పిరికివాడు వీణ్ని నరికితే పాపమేగాని పుణ్యమేమాత్రం అంటుకోదు. "ప్రళయం వికసించినపుడు మనస్సులు క్షోభించి, ఎంత పెనుతుఫాన్న యినా ఈదటానికి వెనుకాడవు" అనేది తెలియదు, మూర్ఖుడు.

(చిన్నకారు క్లబ్ కాంపౌండులోకి వచ్చిన శబ్దం)

(బూటు టక్ టక్ . . శబ్దం విన్పిస్తుంది)

శ్రీమన్నా : ఒరేయ్! బోయ్ (boy).

(లోపలనుంచి అస్తవ్యస్తంగా గోల విన్పిస్తుంది)

అరెరె ఇది క్లబ్ కాదురా— చేపల మార్కెట్— అదైనా మెరుగే నేమో? (రణరణ ధ్వని) ఛీ ఛీ ఛీ ఒరేయి సుబ్బారావూ సిగరెట్టు తీసుకురారా (కళ్ళు నులుముకుంటూవుంటాడు)

కుమార్ ఇదో సార్ (సిగరెట్టు నోట్లో పెట్టి అగ్గిపుల్ల గీచి అంటిస్తూంటాడు)

శ్రీమన్నా ఏయ్ ఎవరు నీవు లోపలికెలా వచ్చావు?

కుమార్ నేనేనండి లోపలికెలారావటం ఏమిటి? విచిత్రంగా మాట్లాడతారండి మీరు

శ్రీమన్నా పరిచయమున్నవాడిలా మాట్లాడుతున్నావే? నీ సమయస్ఫూర్తి మాటలు తీసేసి ఎవరో చెప్పు లేకపోతే గెంటించేస్తాను.

కుమార్ అంత శ్రమ ఎందుకులెండి? సిగరెట్టు కావాలన్నారుగా, ఇదిగో తెచ్చాను

శ్రీమన్నా అధికంగా మాట్లాడకు పళ్ళు రాలతాయి

కుమార్ సరి ఉపకారం చేసినా తప్పేనా సరి అయితే సిగరెట్టు వద్దేమో తీసుకుపోతాలెండి (తీసేస్తాడు)

శ్రీమన్నా ఓరి యూస్‌లెస్‌ఫెలో ఏమిరా నీకాసాహసం అరే మరీ మీద కొస్తున్నావే? నేనెవరో తెలుసా

కుమార్ తెలియకేమండి... మీ వాటం మీ వాలకం కనిపిస్తూందిగా- ఏదో "ఫర్మ్"కు యజమానులని...

శ్రీమన్నా కనపడ్డ మేమిటి—ఇపుడు మన బిజినెస్ అదేగా పెద్ద వ్యాపారం!

కుమార్ అవునండి ఈరోజుల్లో చాల వ్యాపారాలున్నాయటండి, నాలాటోడి కెలా తెలుస్తాయిలెండి? (సందిగ్ధంగా)

శ్రీమన్నా అయితే వే నెవరో నీకు తెలియదన్నమాట. ఒరేయ్ సుబ్బారావూ! ఇలా రారా— మనల్ని గురించి ఇత నొక్కడు మిగిలాడురా తెలుసుకునేవాడు, చెప్పరా..

కుమార్ మళ్ళీ అత నెందుకులెండి— నేనే తెలుసుకుంటాను!

శ్రీమన్నా అదేమిటి మీద కొస్తున్నావే! ఐనా నేనెవరో తెలయదన్నావు?

కుమార్ తెలియకేమండి బాగా తెలుసు ఏదీ ఓసారి తప్పుడు డైరీ చూపిస్తారూ ! ఈవారం ఏరూట్లో ప్రయాణం చేస్తున్నారో తెలుసుకుంటా !

శ్రీమన్నా నా పేరు తెలుసుండేనా యీ వేషాలు ?

కుమార్ వేషాలూ, దోషాలూ నాకేమీ తెలియదండీ ! అవేవో మీకే పట్టుపడివుంటాయి కాలాన్ని ప్రశాంతంగా అధిగమించి కాలయాపనచేస్తున్న కరుణాత్ముల్ని విషపూరితం చేసి, ఆకాశంలో విహరించే గాలిపటాల్లా తయారయ్యే మీలాంటి స్వార్థపూరితు లున్నారంటే తెలుసుకునేబాధ్యత మామీద వుందిగా మరి !

శ్రీమన్నా (గంభీరంగా) ఏమి టా ప్రేలాపనా ఏం వాగుతున్నావో, ఎవరో తెలునా ? శాంతంగా వున్నాననా పైపైకి పోతూన్నావు.

కుమార్ మీ ప్రశాంతతకు భంగం కలుగుతుందనుకుంటా ఎదుటివారి జీవిత స్రవంతి ప్రశాంతంగా ప్రవహిస్తుంటేమాత్రం చూడలేరు

శ్రీమన్నా ఏమిరా ఆ పొగరు (చెంపమీద ఛళ్‌న కొడుతాడు) ఏమిరా కళ్ళు నెత్తిన పెట్టుకుని మాట్లాడుతున్నావు ఇది క్లబ్బు తెలుసా ?

కుమార్ నా చంప ఛళ్ మనిపించావుగాని వెనుతిరిగి గతచరిత్ర స్మరించలేని శ్రీమన్నారాయణగారూ !

శ్రీమన్నా వాపేరూ, నా ఉచ్చస్థితి తెలుసుండి నన్నే రెచ్చగొట్టిస్తున్నావన్నమాట—ఎంతవరకూ తెగిస్తున్నావురా ! నీకు రోజులు గడవకపోతే ఏదో అడిగి తీసుకువెడతావా. ప్రాణం విసిగించి తన్నులు తింటావా ??

కుమార్ అవునుమరి— ముందుముందు మహాసహాయాలు చేసివట్టు ఎంత మమకారం, ఒక్కుమ్మడిగా కలిగింది? విలాసవతుల ఆలింగనాల్లోఅంతర దహనమయ్యే మీలాటిమనస్సుల్లో వెన్నెల కాపురం వుండాలంటే వుంటుందా ? అయినా వెన్నెలకయినా తెలియదా ! నీ సత్యమూర్తి, నీ కృష్ణమూర్తి వుండగా నీహృదయం కరుణామయంగా ఎలావుంటుంది

శ్రీమన్నా అయిందా వాగుడు ఇంకా వుందా వాళ్ళుకూడ కావలసి వచ్చేరే నీ 'నక్షత్రమాల'లోకి— ఇలా తర్జన భర్జన జరిపి నానుండి ఏదో సంపాదించాలని చూస్తున్నావా ? బెగ్గర్ ...

కుమార్ (వికటంగా నవ్వి) అవును బెగ్గరే ! నాకన్నా బెగ్గర్‌గా వుండేవారు, జ్ఞాపకం లేదేమో ? అంతా చెప్పుకునే విషయమేలే ఆ విధవ చౌదరి

కూతురు కనకవేణి చూడకపోతే సరి యీపాటికి స్మశానాల్లో తమరి క్కూడ స్థానం వచ్చేది.

శ్రీమన్నా ఏ...ఏమిటది— నా చరిత్రంతా నీ క్కావలసివచ్చిందా ఏం తన్నమన్నావా ? ఫో అవతలకి నీలాటివాణ్ని కొట్టినా ఒకటే, కుక్కని కొట్టినా ఒకటే...

కుమార్ అవునుమరి స్వభావమే వేరు లేకపోతే నిర్మల లాంటి నిండుయవ్వని, చంద్రముఖారవింద, కుసుమకోమలి నిలువునా ఎందుకు రాలిపోతుంది ?

శ్రీమన్నా, ఏ .వూరుకున్నాననా పైపైకి పోతున్నావు ఊరుకున్నాననా— నిర్మ లెవరు, నేనేం చేశాను సంధి ప్రేలాపనలు ప్రేలకు - ఎవరునీవు ?

కుమార్ స్కూలుఫైనలు వరకూ వెలగబెట్టి, తింటానికి గతిలేక, ఏ గడ్డి బడితే ఆ గడ్డి కరవడానికి తయారై, ఆఖరికి క్లీనరు గాను - డ్రైవరు గాను పనిచేయడానికి నీ దగ్గర జేరి (తొందరగా) ఆదర్శజీవి అమృత మూర్తయిన భార్యను కోల్పోయిన కుమార్. . తెలుసా ..!

శ్రీమన్నా (నిర్విణ్ణుడై) ఆఁ కుమార్ నీవా! మాటల ధోరణి కూడ అర్థంకాలేదుసుమా !! ఇలా వచ్చేవే ? (తొందరగా) ఏమైనా సహాయంకావాలా ?

కుమార్ (వికటంగానవ్వి) సహాయం నీ దగ్గర! ఛీ ఛీ కొంతమంది కన్నా ఆ కుక్క మెరుగు కాస్త విశ్వాసమన్నా ప్రకటిస్తుంది సహా యం చేస్తాడట—సహాయం పిలూ సుబ్బారావును తన్నిద్దువుగాని ఊఁ—కానీయి నీ పని ?— నిర్మల తెలియదే ! పాపం ఎలా తెలుస్తుంది? దొంగ సారా పీపాలుపీపాలుగా అమ్మించి ఇనప్పెట్లు నింపుకుని అనవ సరంగా అన్యాయంచేసి, లారీలో సారాపీపాలు వేసి నేయ్యిడబ్బాలని చెప్పమని పదిహేను రోజులు గ్రామాంతరానికి నన్ను పంపేవే ? మర్చి పోయావనుకుంటూ పంపి ఏంచేశావు ? (ఏడుస్తాడు) నిర్మలను, నా ప్రాణాన్ని నిలువునా నాశనంచేశావే ! మర్చిపోయుంటావ్. ధనమదాంధం నీ తప్పు కాదులే !!

శ్రీమన్నా (తడబడుతూ) నేనేం చేశాను ! నీ భాస్కరం చేసినపని దానికి నేనా బాధ్యుణ్ని ?

కుమార్ భాస్కరంలట భాస్కరం ! నా ప్రాణస్నేహితుణ్ని అడ్డంవేసుకుని ఆడిన నాటకమంతా ఆడారు, ఆ కృష్ణమూర్తి, సత్యమూర్తి, నీవూను

నీకింకా అక్కసు తీరలేదే ? నీ ప్రచ్ఛన్న వేషాలు తెలియవనా ! పది హేను రోజులు నన్ను గ్రామాంతరం పంపి నా ఇల్లు సోదాచేయించి నా నిర్మలను కేసుపేరు పెట్టి బంధించి దాని నాశనానికి ఒడిగడతావే ? దొంగచాటుగా సారా అమ్మించి ధనం సేకరించే నీ దగ్గర పనిచేసే నాకు, నల్లమందు ఎక్కణ్నుంచి వచ్చింది ఏం మాట్లాడవు చెప్పు? (కత్తి తీస్తాడు)

శ్రీమన్నా (ఉక్కిరిబిక్కిరై) నేనేం చేయలేదే ! ప్రభుత్వం దృష్టిలో నీవు నేరస్థుడిలా కన్పడ్డావు అంతే—నేనేం చేశాను ఆ కత్తి (తడబడుతూ) తీశావెందుకు—

కుమార్ ఆర్థిక మదాంధకారంలో తన చరిత్ర తెలియక తైతెక్కలాడే నీలాటి ప్రచ్ఛన్న వేషాలు వేసే స్వార్థపూరితుల్ని దీనికెరగా వేసి మనస్సు 'శాంతి' చేసుకోవటమే నీకా 'త్రయం' సరిపోయారు నాగభూష ణాన్ని కళ్ళముందునిల్పుకుని కృష్ణమూర్తిని, సత్యమూర్తిని 'డబ్బు'తో మధ్యపెట్టి నా నిర్మల కేసులో ఉపయోగించుకుని, నాకు జైలు శిక్ష విధించావ్ ! గుర్తుందా ? నా నిర్మలను నేను లేని పదిహేను రోజులు చిత్రహింసల పాల్జేసి ఇటు నాకు లేనిపోని కల్పనలు చేసి జైలు శిక్ష ప్రసాదించావు అన్నీ అయిపోయాయిగా ఆ చివరనుంచి యీ చివర వరకు ఇండియా అంతా గాలించి విడిచిపెట్టావు పచ్చని సంసారాల్లో చేయిపెట్టి కెలికి, వాళ్ళను నాశనంచేసి నీపేరుమాత్రం యథాప్రకారం గానే నిలువుకుంటున్నావు "దేశోద్ధారకుడవు"— లోకం దృష్టిలో సంఘ పోకడలో నీవొక ఆదర్శవాదివి ఈ సమయం అయిపోయింది నీ అంతిమ ఘడియల కోసం చూశావా యీ నా పవిత్రమైన "వస్తువు" ఎంతగా కళ్ళు కాయలుకాచి నిరీక్షిస్తుందో ?

శ్రీమన్నా (భయంగా) నా మీద కత్తిదూస్తే నీకేమొస్తుంది ? అంతా వాళ్ళు పన్నిన పన్నాగమే నా దగ్గర పనిచేస్తున్నావు కాబట్టి, నన్ను పిల్చి అడిగేరు చెప్పి, కాస్త శిక్ష తగ్గించేలా చేశాను అంతే !

కుమార్ నాదీ అంతే ! అన్యాయంగా నిర్మలమూ, ధార్మికమూ కల్గిన కుటుంబంలో తలదూర్చి వారిని నాశనం చేసినందుకు యీ ప్రాణాలు యిక్కడతో పూర్తిచేస్తే భగవంతుడు శాంతిస్తాడు ఏం చేస్తాం ? నీ పాత్రను అలా సృష్టించాడు వన్నీమాదిరిగా పంపాడు. ఏం

సాగేట్టు లేదా? "తప్పులున్న వాళ్ళ వప్పులుడకవు ఎన్ని కుప్పిగంతు లేసినా చప్పగానే వుంటుంది"—

శ్రీమన్నా నే నేదో తప్పుచేశానని నా ప్రాణం తీస్తా నంటున్నావు (ధైర్యాన్ని చిక్కబట్టి) పోయిన నీ భార్య తిరిగివస్తుందా?

కుమార్ కల్లబొల్లి మాటలతో దాటుకుపోలేవులే నా భార్యనెలా అన్యాయంగా ప్రాణాలు తోడించేవో నీ ప్రాణంకూడ అలా ఎరగావలసిందే! నా ముందు నా నిర్మల లేనిదానికి నీవు మాత్రం దేనికి (కత్తి పైకి ఎత్తుతాడు)

శ్రీమన్నా (బిత్తరపోయి) నన్ను చంపుతావు నీ దాహం కడ్తుందా అన్యాయస్థానం మాటేంచేశావు? నా నంసారం నట్టేట్లో ముంచటం నీకు న్యాయమేనా? నా భార్య ముఖం ఇక చూడనీయవా కుమార్ నాకు ఒక్క కొడుకూ లేడుగదా, అంతా కూతుళ్లే, నీకు తెలుసుగదా!

కుమార్ అందుకని నా పని మానమంటావా? అది జరుగదు నీ భార్య ముఖం నీకు కావాలే, నా భార్య ముఖం నాకక్కర్లేదనా అంతవరకూ తెగించావు నీలాంటి దయా, కరుణా నాకు లేవనా— నిర్మలా (చాల విచారంగా) కారిన్యానికి అంకితమైపోయావా? తప్పదు నా నిర్మల కూడ నాకు సైగ చేస్తుంది, ఆలస్యం చేయవద్దని

శ్రీమన్నా (కంగారుగా) కుమార్ నా భార్య అదిగో నా భార్య ముఖం నా కోసం ఎంతగా చూస్తుందో అదుగో

కుమార్ భార్యట భార్య రాత్రి యింటిదగ్గ రేడిపించి వట్టుకొచ్చేవు చేతికందినంత— దాన్ని ఇక్కడ అప్పజెప్పిపోతావు యింటికి— (నిరసనగా) ఇంకా ఎందుకు నీకు భార్య ?

శ్రీమన్నా అదికాదు కుమార్! నా భార్యకు నేనంటే ఎంతో ప్రాణపదం నన్ను విడిచి ఒక్క క్షణం ఉండలేదు కుమార్! నన్ను విడిచిపెట్టు కుమార్ (లేవబోవును)

కుమార్ విడిచిపెట్టాలిట విడిచిపెట్టాలి నిర్మలా నిర్మలా (ఏడుస్తాడు) (పశ్చాత్తాపపడి) అవును భార్య కాచుక్కూచుంటుంది, నిజమే!! అదుగో నా నిర్మలకూడ చెపుతుంది విడిచిపెట్టమని భార్య ఎదురుతెన్నులు చూస్తుందట! నిర్మలా నీవు చెప్పినట్టే చేస్తా నిన్ను దాటిపోలేను నిర్మలా (ఏడుపు) నిర్మలా.... పిరికివందా! అంధుడవై

అన్యాయాలుచేసి పశ్చాత్తాపపడి మనస్సు మార్చుకున్నావని విడిచిపెడ్తు
న్నాను— ఫో ఫో నీ భార్య ఎదురుచూస్తుంటుంది ఫో

(శ్రీనున్నా కుమార్ నిజమేనా (తడబడ్తూ) నిజమేనా నిజమేనా
(నీరసంగా)! (వెళ్ళిపోతాడు)—

కుమార్ నీలాగ ప్రవర్తించనుఫో—ఇక క్లబ్ ముఖం ఎప్పుడైనా చూశావా
ఇదిగో (కత్తి చూపిస్తాడు)

(ప్రక్కనుంచి కోయిల రాగం సన్నగా వినిపిస్తుంది)

పిరికివాడు వాళ్ళను చూసి ఆటలు ఆడుతున్నాడేగాని సహజంగా చాల
భయస్థుడు విగ్రహం మాత్రం వుంది పిరికివానిమీద చేయిచేసుకోకూడ
దన్నారుగా! .. మూర్ఖుడు

(ఆటో రిక్షా వచ్చే శబ్దం)

కృష్ణ ఒరేయి సూర్యం... మనస్నేమీ బాగోలేదురా ఓవల్టిన్ను తీసుకు
రారా... అబ్బబ్బ తలనొప్పి దంచేస్తుందిరా—తొందరగా రారా...

కుమార్ ఇదోసార్—(ఓవల్టిన్ను తెస్తాడు)

కృష్ణ ఎవరు నీవు? గొంతుకు మారిందేమిరా అనుకున్నా ఎందుకొచ్చేవు
ఇక్కడకు ? ఇది ఊరులో వున్న పెద్దవాళ్ళకు సంబంధించిన క్లబ్
తెలుసా...

కుమార్ తెలుసండీ

కృష్ణ తెలిసేనా! సుబ్బారా వేడీ? ఎవరువాయి నీవు?

కుమార్ నేనొక మానవుణ్నండీ! కనపడ్డంలే—

కృష్ణ కనపడ్డంలే, ఏమిటావాగుడు? తలబిరుసుగావుందా? చిన్నంతరమూ
పెద్దంతరమూ లేదా?

కుమార్ లేకేమండి, బోలెడుంది మీకేమైనా కావాలా?

కృష్ణ కావాలా! సరి, పరిహాసంకూడానా!!

కుమార్ పరిహాసం నాక్కాదే? ఎదుటి మానవ జీవితాలు క్షణికాలు తన
జీవితం ఓ మధుర రసభరితం అనుకునేవారికి పరిహాసం గాని...

కృష్ణ (బిగ్గరగా) నీ సొదంతా నా కెందుక్కాని- అసలు ఎవరు నీవు?

కుమార్ (వికటంగా చిన్నగా నవ్వి) ఎదుటివారి జీవితాలను విషపూరితం
చేసి, తమతమ జీవితాలను బంగారపు కొమ్మమీద ఆరవేసేమనుకుని
కులుకుతూన్న స్వార్థజీవితాలను ఆహ్వానించే మానవుణ్ని- తెలిసిందాండి

కృష్ణ (అర్థం కానట్టు) సరి, వేదాంతం కూడానా (చిన్ననవ్వు)
కుమార్ కావాండిమరి కాచివడబోసిన కరుడుగట్టిన సత్యాన్వేషకులు. మీలాటివారికి యీ వేదాంతం ఎలా ఎక్కుతుంది? అది కాస్తా చల్లారి పోతుంది, సేవించండిమరి .. సిగరెట్టు తెమ్మన్నారూ!
కృష్ణ సిగరెట్టా!! అటువంటి పాడు అలవాట్లు లేవుగాని, నా గురించి చాల శ్రమపడుతున్నావు పాపం ఎవరవయ్యా నీవు (వ్యంగ్యంగా)-?
కుమార్ నేనేనండీ!
కృష్ణ ఏమిటా డొంకతిరుగుడు సమాధానం?
కుమార్ అవును కుటిలస్వభావాలు కలవారికి అలానే వుంటాయని అన్నారు లెండి మా సమాజం వాళ్ళు
కృష్ణ (కోపంగా) ఏంమాట్లాడుతున్నావో తెలుసా?
కుమార్ తెలియకేమండీ, తెలుగులో నేమాట్లాడుతున్నా నే—అయినా నాకు తెలుగుతప్ప ఏ భాషా రాదులెండి—
కృష్ణ అందుకని నీ యిష్టమొచ్చినట్టు మాట్లాడడమేనా?
కుమార్ ఇష్ట మొచ్చినట్టా! అ దెలా కుదురుతుందండీ?
కృష్ణ అయితే నీవు మాట్లాడేది తెలుసుండే మాట్లాడుతున్నావన్నమాట!
కుమార్ అబ్బెబ్బె అ దెవ రన్నారండీ?
కృష్ణ అయితే ఏమిటి నీ వనేది? అసలు ఎవరు నీవు?
కుమార్ నేనే నంటూంటే, ఎవరంటా రేమిటండి? నేను తెలియదూ? నేను (వికటంగా నవ్వి) నన్ను తెలియనివారుండరు
కృష్ణ సరిగ్గా చెపుతావా, యీడ్పించమన్నావా, సుబ్బారావూ?
కుమార్ సుబ్బారావూ లేదూ, సూర్యం లేదూ అంతా స్మశానానికి వెళ్ళేరు?
కృష్ణ ఏమిటా పొగరుమోత్తనం పొగరు దింపించేస్తాను— తెలుసా
కుమార్ అవును తెలియకేం. ఉన్నారుగా శ్రీమన్నారాయణ, సత్యమూర్తిను ఒరితెగిన బ్రెల్లా తయారయ్యేరు
కృష్ణ ఏమన్నావురా (చంపమీద ఛళ్ మనిపించి) గర్భదరిద్రుడిక్కూడ పొగ రేనా? మళ్ళీ పీళ్ళు ఆదుకుని ఆదరించకపోతే గడువదు వేలెత్తి వెక్కిరిస్తున్నాడు సన్యాసి
కుమార్, అవును సన్యాసినిగనుకే ఎక్కేగడపా, దిగేగడపాతో సరిపోతుంది కాలం కృష్ణమూర్తిగారూ!

కృష్ణ సరి పేరు తెలుసుకునే దిగేవన్నమాట రంగంలోకి ఇహ నేం కానీయి నీ ఉపోద్ఘాతం

కుమార్ ఇంకేం ఉపోద్ఘాతం. మిగిలిందంతా అఘాతమేగా ? నిలువునా కూలిపోయింది పాపం నిర్మల దాన్ని పొట్టన పెట్టుకున్నావు—

కృష్ణ (గద్దించి) ఎవరది ? దానికీ నాకూ సంబంధం ఏమిటి ?

కుమార్ అవును, నిజమే ! సంబంధం ఏమిటి ? చీకూ చింతా లేకుండా జీవించే జీవితాల్లో విషపురుగులా ప్రవేశించి వారిని నేలమట్టానికి రాసేయటమే నీకు మిగిలింది

కృష్ణ ఏమిటిరా కూస్తున్నావ్ ?

కుమార్ కూస్తాను, కాసేపుంటే చీలుస్తాను నేనెవరో తెలుసా (కత్తి తీస్తాడు)?

కృష్ణ ఏమిటా దౌర్జన్యం ?

కుమార్ నీలా దౌర్జన్యంచేసి తప్పుడు సాక్ష్యాలిచ్చి వేలకువేలు అపహరించటానికి రాలేదు బ్రోతల్ యాక్టున్నాకూడ నీవు వేసే వేషాలను అరికట్టాలని రాలేదు సత్యమూర్తితో స్నేహంచేసి అతన్ని ఎలక్షనులో దింపి అతన్ని సర్వనాశనం చేయదలచుకున్న నీతో విరోధాన్ని ఆశించిరాలేదు. కాని, శ్రీమన్నారాయణతో చేయికలిపి, అన్యాయంగానిర్మలప్రాణాలు తోదేసి నిర్మలమూర్తివై జీవిస్తూన్న నీ జీవితాన్ని అంతం చేయాలని వచ్చిన కుమార్ తెలుసా

కృష్ణ ఆఁ. . కుమార్ . నీవా ? . నీవా కుమార్

కుమార్ అవును నేనే ఎంతోమంది శీలాలను సర్వనాశనంచేసి కులుకుతూన్నది చాలక ఆ శ్రీమన్నారాయణతో షరీకై నేను లేకుండా చూసి తప్పుడు సాక్ష్యాలు అందజేసి నిర్మల జీవితాన్ని నాశనంచేశావు—అవునా ..

కృష్ణ (భయపడుతూ) నేనా ! నేనా .. కాదు కుమార్, కాదు శ్రీమన్నారాయణ సత్యమూర్తీను .

కుమార్ (కత్తిచూపిస్తూ) ఊఁ... సరిగా చెప్పు— అందుకా శ్రీమన్నారాయణ నన్ను క్యాంపుకు వెళ్ళమంటుంటే వంతపాటపాడి తొందరగా వెళ్ళమని తొందరచేశావు మీరు చాలకాలంనుంచి పొంచివున్నారన్న మాట సమయంకోసం సమాజంలో చీడపురుగుల్లా ఖైలుదేరి వున్న డబ్బును అడ్డంపెట్టుకుని ఆడుతున్నారా ఆటలు మీరుచేసే చేష్టలు, ఆడే ఆటలు కప్పటానికి దీన్నుపయోగించి కారుల్లో షికార్లుకొడుతున్నారా?

పిలూ, నీ సత్యమూర్తిని పోలీసు రిపోర్టిస్తాడు "సంఘంలో జరిగే అన్యాయాలను అరికట్టాలి, అభ్యుదయపంథాలో మనమంతా ఒకే గొంతుతో ఎలుగెత్తి మన జాతిని మేల్కొలపాలి. నిదురపోతున్న సమాజాన్ని వికాసంతో సాకి వెన్నెలమయం చేయాలి." అని ఇంకేవేవో బల్ల పగలగొట్టి చెప్పేవే యీ క్లబ్ వార్షికోత్సవంలో... ఇదేనా నీవుచేసే దేశసేవాతత్పరత! నీవు చూపే ప్రేమమయచూపు లివేనా !! శ్రీమన్నారాయణతో కలిసి నిర్మలను అన్యాయంచేసి, దాన్ని నాకొక్కకుండా చేసి పంచాముకున్నావు నిర్మలా నీప్రాణాలు నీవికావు దీని కావో రంగా నీవు కావలసిందే ? నీ నుంచి చిందే ఆ రక్తం నా నిర్మలకు 'మణిప్రవాళం' కావలసిందే! ఈ సమాజంలో నీలాటి అవినీతి పరులుంటే నాలాటి వారెంతమంది దినదినగుండాన్ని తప్పించుకోవలసిన వారౌతారో? (కత్తి పైకెత్తుతాడు)

కృష్ణ కుమార్ - కుమార్, నేను చేసిందంతా తప్పే! ఆ సత్యమూర్తిని చూసుకుని, ఆ శ్రీమన్నారాయణ చూపే ధనాని కాశపడి చేయరాని అపచారాలెన్నో చేసేను అంధుణ్ణయి అన్యాయాలను చేసేను ఇపుడు నిజయాలంగా పశ్చాత్తాపపడుతున్నాను నన్ను విడిచిపెట్టుకుమార్.. ఇవికాళ్ళు కావు కుమార్ చేతులు - ప్రాధేయపడి వేడుకుంటున్నాను

కుమార్ నీలాంటి పాషాణుడి మాటలు నేను లెక్కచేసేది లేదు నీవు యీ లోకంనుంచి యాత్ర చేయవలసిందే!

కృష్ణ క్షమించి, రక్షించు కుమార్, ఎల్లుండి మా అమ్మాయి నిర్మల పెళ్ళి కుమార్ .అమ్మాయి నిర్మల పెళ్ళి కుమార్...దాని ముఖమయినా చూసి విడిచిపెట్టు కుమార్. ఆడవాళ్ళను చెరపట్టాను చేయరాని అపరాధాలు చేశాను అపరాధినై వేడుకుంటున్నాను నాకు కనువిప్పు కలిగింది కుమార్ నా నిర్మల నా నిర్మల కుమార్

కుమార్ నిర్మల నిర్మల అవును— నిర్మల ఆడదాని కుటుంబంలో మచ్చవస్తే అలానే నిలచిపోతుందట నిర్మల అనేది నిర్మల... నిర్మల... పవిత్రమూర్తి .. నిర్మల... ఫో... ఫో . నా నిర్మల విడిచిపెట్టమంటుంది . ఫో...

కృష్ణ కుమార్ నీ మేలు మరువలేనుకుమార్ కుమార్ నిర్మల . నిర్మల (వెళ్ళిపోతాడు)

(దూరంగా సన్నాయినుంచి సంగీతం కమ్మగా వినిపిస్తూంటుంది)

కుమార్ అవును నిర్మల అదిగో పొమ్మన్నందుకు ఎంత సంతో షిస్తుందో? అదుగో నాకు పూలదండ వేస్తుందదుగో?. నా నిర్మ లెంతమంచిది—ఎంతో మంచిది నేనూ వస్తున్నా నిర్మలా (పకపకా నవ్వుతాడు)

(చిన్న కారు వచ్చిన శబ్దం)

సత్య సుబ్బారావూ, సుబ్బారావూ! ఆ పేకముక్కలిలా పారెయ్యిరా వాళ్ళంతా వచ్చేలోగా పేకంతా ఓసారి సర్దేస్తే 'ఉగాది' కి సరిపడా తీరిపోతుంది. నిన్నను ఆ యిన్సూరెన్సు ఇన్స్పెక్టరు పట్టుకుపోయాడు అయిన పాతిక వేలూను తొందరగా తీసుకురారా—మంచినీళ్ళు కూడ తీసుకురా చాల దాహంగా వుంది

కుమార్ ఇవిగోనండీ

సత్య ఎవరు నీవు ?

కుమార్ నేనేనండీ—మర్చిపోయారా! అపుడే!! పేకలివిగోనండి గొంతుక పిడచగట్టుకుపోతుంది యీ మంచినీళ్ళు త్రాగండి

సత్య ఎవరు నీ వంటే మంచినీళ్ళు త్రాగు అంటావ్ ?

కుమార్ ఫర్వాలేదు త్రాగండి ఎలక్షను కాన్వాసింగులో చాల శ్రమపడు తున్నారు

సత్య నా శ్రమ నెమరు నీకెందుకులే— అసలు నీవెవరు ఒరేయి సుబ్బా రావూ— అశ్రద్ధగా వుంటే ఇటువంటి వెధవలు ఆనూపానూచూసుకుని అందింది పట్టుకుపోతారురా—ఎక్కడ చచ్చావురా ?

కుమార్ అవును మరి మా బుద్ధులే అంత ఏంచేస్తాంలెండి మరి ఒకప్రక్క కడుపు మాడుతూంటే ఏంచేస్తాం ?

సత్య ఏంచేస్తాం ఏమిటి, దున్నపోతులా వున్నావు పనిచేసుకు బ్రతకలేవూ ?

కుమార్ బ్రతకటానికేమండీ ? ముందు పనిస్తారు తరువాత ఆ యింట్లో అందమైంది కనబడితే పనిచేసేవాడి తాలూకు కదా అని అనరాని మాటలు చేయరాని పనులూ చేస్తారు అంతేగా

సత్య : అంత చుల్కనయిపోయాముగా! పనిచ్చి ఆదరిస్తున్నా ఆగ్రహమేరా కృతఘ్నుడా ?

కుమార్ ఆ మేము కృతఘ్నులం ఎలా అవుతామండీ! మీరే ?—

సత్య అలాగా (చంపమీద ఛళ్ ఛళ్ మని రెండు వేస్తాడు) ఎదిరించి మాట్లాడు తున్నావు

కుమార్ అవును పొరపాటే! వూరికి పెద్దలు యీ మునిసిపల్ ఎలక్షన్లో కౌన్సిలర్ పదవికి పోటీచేస్తున్న సంఘ సంస్కర్తలు. సమాజంలో ఆదర్శవాదులు శ్రీమన్నారాయణకు ప్రాణతుల్యులు కృష్ణమూర్తి గారి కుడిభుజం మిమ్మల్నెలా ఎదిరిస్తాం?

సత్య అయిందా ప్రసంగం, ఇంకావుందా? పాపం నోరు అరుకుపోయి యుంటుంది కాస్త ఆ నీళ్ళు త్రాగు— దాహమన్నా తీరుతుంది

కుమార్ మీ ఆర్థిక దాహం తీర్చుకుంటున్నారుగా

సత్య ఏయ్ నేనెవరో తెలుసా?

కుమార్ తెలిసేగా మీకోసం వస్తా (కోయిల కుఃయ్కుఃయ్మని కూస్తుంది) ఎలక్షన్లో కౌన్సిలరు పదవి వస్తుందని నిర్ణయించుకుని రెండు పార్టీలుగా వున్న చైర్మన్‌లలో 'నాయుడు' గారి దగ్గర ప్రెశిడెంటుగా తనకే ఓటు వేయడానికి 'పదివేలు' తీసుకున్న సత్యమూర్తిగారని. నిర్మల జీవితాన్ని సర్వనాశనంచేసి, తప్పుడుసాక్ష్యం అందజేసి. శ్రీమన్నారాయణ దగ్గిర 'పదిహేనువేలు' తీసుకుని, ఎలక్షను పేరుచెప్పి 'ఓపెన్‌టాప్ ప్యాంటాక్' కారులో షికార్లు కొడ్తూన్న సత్యమూర్తిగారని. ఆదర్శవాది, గ్రామానికి మణిపూస మాణిక్యాలరావుగారి జ్యేష్టకుమారుడని, 'బ్రేకట్' కంపెనీకి ప్రసిడెంట్తై వేలకువేలు కొట్టేసి అగ్గిపెట్ల ఫేక్టరీ ప్రయత్నంలో తిరుగుతున్న సత్యమూర్తిగారని తెలుసుండి కలుసుకొని ఘనసన్మానం చేద్దామని వచ్చేను

సత్య అలాగే పాపం, నోరునొప్పుసుకుని వచ్చిందారి పుచ్చుకో అనవసరంగా వేల•వో

కుమార్ ఏ మీ రౌడీ అప్పారావుతో తన్నిస్తారా? అంతకన్నా భాగ్యం ఏంగాను?

సత్య ఏ (చిరాగ్గా) ఎవరు నీవు రాస్కెల్

కుమార్ నేనా ఇంకా తెలియలేదూ (వికటంగా, ప్రళయంగా నవ్వి) శ్రీమన్నారాయణతోను, కృష్ణమూర్తితోను కలిసి హాయిగా కాలయాపన చేస్తూ అన్యాయాలు అవిరళంగా చేస్తూ. మీ దృష్టిలో నిర్మ

లను పొట్టను పెట్టుకోగా మిగిలి దాని భ ర్త స్థానంలోవున్న (హూంకా రంతో) కుమార్

సత్య  కుమార్ కుమార్  ఎప్పు డొచ్చేవు ?

కుమార్ చచ్చే డనుకున్నారే- నీవుకూడ |డయివరుగా వేసుకుంటావా ? ఎందు కేసుకుంటావ్ ? నీకు లాభం ఏది - ఏమీ లేదుగా అంతా మిధ్య.

సత్య · లాభం ఏమిటి ? నిరుద్యోగుల్ని పోషించడమే మా విధి.

కుమార్ నిరుద్యోగుల్ని పోషించటమే పరమావధి అని బోర్డు తగిలించుకుని నిర్మలలాంటి అబలలను నిస్సహాయులుగా చేసి చిత్రహింసలకు గురిచేసి, అన్యాయాలు చిలువలు పలువలుగా చేయటమూ మీ విధేగా ! అందుకు ప్రతీకారంగా నిన్నుకూడ ఆమెను చేరడానికి తొందరలో పంపటమే నా విధి ఏం చేయను (క త్తి తీస్తాడు)...

సత్య క త్తి తీస్తావు దేనికి - నా ప్రాణం తీస్తావా ? ? (కంగారుగా)

కుమార్ మరింకెందుకు ? లేకపోతే చాల అన్యాయాలు జరుగుతాయి నిరుద్యోగులు ఇంకా చాల బాధలు అనుభవించవలసివస్తుంది...దిక్కులు చూస్తావే ?... జేబులు తడుముకుంటున్నావే ? నీ పిస్టలు తేలేదనా —ఇంటిదగ్గర భద్రంగా కావలా కాస్తుందిలే నీ యినప్పెట్టిని అన్యాయపు సొమ్మేగా, ఇంకా వున్నారుగా అనుభవించడానికి

సత్య నీ నిర్మలను నేనేమీ చేయలేదు కుమార్ . నే నేపాపము ఎరుగను కుమార్...అంతా శ్రీమన్నారాయణ, కృష్ణమూర్తి పన్నిన పన్నాగం నాదేమీ లేదుకుమార్

కుమార్ ఆనాడేమీ జ్ఞాపకం రాలేదే ?

సత్య కుమార్... నా భార్య అమ్మాయి కుసుమ అలోలక్ష్మణా అంటూ ఏడుస్తారు కుమార్... నా భార్య కుంకుమ రేఖ నిలబెట్టుకుమార్— నన్ను చంపితే నీ కొచ్చే లాభం ఏముంది ?

కుమార్ లాభాని క్కాదు ప్రతీకారంగా నీ ప్రాణాలు దక్కకుండా చేయటమే అన్యాయాలు పెచ్చుపెరిగిపోతున్నాయి ముగ్గురూ మూడు స్థానాలు సర్దుకుని కావలసిన స్థావ రాలు చూసుకుని కులుకుతున్నారు ఆకాశంలో విహరించే విహంగాల్లో ఎగురుతున్నారు చేయరాని అపరాధాలకు, వినరాని ఘోరాలకు ఆటపట్టయిపోయారు. నిష్కల్మషంగా జీవిస్తున్న కుటుంబాలను రచ్చకెక్కించి మీప్రతిభను చాటుకుంటున్నారు

భార్యట భార్య... నాకు భార్యకాదను కున్నావే? నిర్మల ఎంత గోడుగోడున ఏడ్చిందో యోచించావా? శ్రీమన్నారాయణతోను, కృష్ణమూర్తితోను కలిసి పాటపాడతావా?... నీ భార్య కుంకుమరేఖ నిలపాలా? నాకు నా భార్యను నిలిపావా?? ఓరి పిరికిపందా—అంధుడవై సంచరించి, యీనాడు వేడుకుంటున్నావా? నిర్మలా (విచారంగా)... నీ చూపుల్లో చల్లదనం ఎంతో తీయగా వుంటుందనే వాడిడుగో సత్యమూర్తి నిన్ను జేరుతున్నాడు (కత్తి పూర్తిగా పైకెత్తి దగ్గరగా రానిస్తాడు)

సత్య కుమార్...కుమార్ .. పదవీ భ్రష్టుణ్ని చేయకు కుమార్... మునిసిపల్ ఎలక్షనులు వస్తున్నాయి కుమార్

కుమార్ ఇంకా ఆశ...! ప్రాణాలు నీవేనా తీపి అందరిదీ ఒకేరకమైన ప్రాణం కాదే?... పాపం యిప్పుడు తెలిసిందా!! నీ ప్రాణం మాత్రం నీకు విడిచిపెట్టేటి లేదు . - (పోలీసు విజిలు దగ్గరగా వినిపిస్తుంది రెండుసార్లు) అదుగో పోలీసులు వస్తున్నారు వాళ్లు ముగ్గురు చవటలై పోలీసు రిపోర్టిచ్చుంటారు గర్భ దరిద్రులు (స్వగతంలో) వాళ్లుముగ్గురూ బ్రతికేక వీణ్ని హతమారిస్తే లాభం ఏమిటి? ఇక నీ ముఖం యీ క్లబ్ దరిదాపుల ఎప్పుడయినా చూపించావో దీనికి ఎరగా అయిపోతావు బ్రతికిపోయావు—ఫో . (పరుగెత్తే అడుగుల సవ్వడి)

—'పరాజితుడు'



*గేయం.*

# జీవనవనీతం

— *"గజ్జెపల్లి"*

నవనీతమే జీవ
నము, జీవనమ్ము నవ
నీతమై జ్ఞాన చం
ద్రికల నీనెడి నాడు
హృదయ మెందుకు తమః
పథమందు విహరించు ?
మనిషి దేవుడు గాక
మరి యెవ్వడనిపించు ?

జీవ కారుణ్యా లీ
లా విస్ఫుర త్పంచ
శీల సిద్ధాంతమ్ము
పాలించి నన్నాళ్ళు
గగనమ్ముపై స్ఫుత్ని ;
కెగిరిన భయమ్మేమి ?
ప్రగతి మార్గము నందు
భాసించదా భూమి ?

తారకా ముగ్ధ సౌం
దర్యమ్ము, మల్లికా
కోరక స్నిగ్ధ శృం
గారమ్ము, నవ జీవ
సారమై విజయ శం
ఖా గావ మొనరింప—
అణ్వాస్త్ర ఝంఝా ని
లాంతర ప్రళయాగ్ని
నెపడు లక్ష్యము సేయు ?
నెవ్వడాజ్యము పోయు ?

భవ్య భారత ధర్మ
పరిమళానిలము లీ
జగతి ప్రసరించి స్వే
చ్ఛగ స్వచ్ఛముగ నిల్వ
విశ్వ శాంతి చిగుళ్ళు
వేయు టది నిక్కము
శశ్వత్సుఖా శ్రీలు
సాధించు లోకమ్ము—

*        *        *



# కనుపించని కందకాలు

— "జీవన్"

ఆనందరావు యే ముహూర్తాన పుట్టేడో గాని తల్లిదండ్రులు యెంచి మంచి పేరే పెట్టారనిపిస్తుంది పేరుని సార్థకం చేసుకున్న వాళ్ళ జాబితాలో ఆనందరావుక్కూడా స్థానముండి తీరుతుంది సర్వదా చిరునవ్వే అతని ముఖమ్మీద తాండవిస్తో వుంటుంది

అప్పుడే ఆఫీసునుంచి మధ్యాహ్నం భోజనానికై వచ్చిన ఆనందరావు పనిమనిషి తెచ్చే కారియరుకోసం నిరీక్షిస్తున్నాడు. ఎంతకి రాదేం చెప్మా? తనకి వేళయిపోతోంది పుట్టి మునిగి పోతోన్నట్టు గంటే 'లంచ్ టైమ్' ఇచ్చారు ఆఫీసువాళ్ళు నడవడానికే అయిపోతుంది సుమారు నలభై నిముషాలు!

ఏవీ, తోచక పచార్లు ప్రారంభించాడు ఆనందరావు పోయినసారి జానకి పండగకి పుట్టింటికి వెళ్ళిపోయినప్పుడు కూడా యిట్లానే బాధపడాల్సి వొచ్చింది తను.

జానకే వుండివుంటే యిలా ఆలస్యంచేసి వుండునా? చేసినా తను పూరుకుని వుండేవాడా? ఇంతవరకూ జానకి ఆలస్యంగా వంట చెయ్యడం వల్లగాని లేదా వడ్డించడం ఆలస్యం కావడంవల్లగాని తను ఆఫీసుకెళ్ళడం ఆలస్యమైందా అని ప్రశ్నించుకుంటే లాకేత్వం దాక్కొమ్మ యెదురవుతుంది అలాంటి అదృష్టంమాత్ర మెంతమందికి పడుతుంది! చిరునవ్వుతో సాగనంపే జానకి పుట్టింటో పురిటి కెళ్ళింది మాతృత్వాన్ని వహించబోతోంది జానకే 'తల్లి' గా మారిపోతే తన మీది ప్రేమ తగ్గుతుందేమో! ఆ బిడ్డ తన ప్రేమనుకూడా పంచుకోబోతాడు గనక పర్వాలేదు తన మీద జానకికిగల ప్రేమ. శ్రద్ధ తలచుకుంటూంటే యిట్లాంటి వ్యక్తు లింకా లోకంలో వున్నారా అనిపిస్తోంటుంది

తనకోసం పొద్దున్నే లేచి వేడినీళ్ళుకాచి, కాఫీ టిఫిన్లు తయారుచేసి చిరునవ్వుతో తనని మేల్కొల్పి-పసిపిల్లాణ్ణి లేపి స్నానం చేయించి బువ్వతినిపించే మాతృమూర్తిలాగా తనకన్నీ సిద్ధపరిచే జానకి లేకపోతే యెంత శ్రమ పడాల్సివస్తోందితను! స్త్రీ కుండాల్సిన యెనిమిది గుణాలూ ఆమెలో మూర్తీభవించాయి. అదే తన ఆనందం!

తన ఆఫీసులో గుమాస్తా కృష్ణమూర్తి రోజూ పర్మిషనడిగి వెళ్ళిపోవడమే! ఏమంటే తిండి తినకుండా వచ్చానని. వేగంగా పోయి ఏ టిఫినో తినాలని కారణ మడిగితే భార్యతో జట్టీ రోజూ దెబ్బలాటలే!

అతనికంటె తను సర్వవిధాలా అదృష్టవంతుడు కాదూ! దాంపత్య జీవితంలో యింత వరకూ యెలాంటి యెగుడు దిగుళ్లు రాలేదు. తనని ప్రాణంకంటె యెక్కువగా చూసుకునే భార్య లభించేకంటే కావాల్సిన అదృష్టమేముంది?

కూతురికి తగ్గ తండ్రే నన్నట్టు మావఁగారుకూడా తనమీద యెంత ప్రేమ చూపిస్తారో అంచనా వెయ్యలేదు తను! ఈ రోజుల్లో కొడుకులస్థానాన్ని అల్లుళ్లే ఆక్రమిస్తున్నారు! తన ప్రవర్తనను గురించీ, మంచితనం గురించీ పని బెట్టుకుని ఆయన కావలసిన వాళ్ళందరితోనూ టాంటాం వెయ్యండే నిద్రపోడు. ఆయనకి తనమీద

వున్న వాత్సల్యానికి తానెంత ఋణపడి వున్నాడో! ఆయన శ్రమఫలితమేమో నన్నట్టు చుట్టాలందరూ తనని యెంతో గౌరవంగా చూస్తారు కనబడ్డప్పుడల్లా పలకరిస్తారు ఆప్యాయంగా. తను దగ్గిరవాడని చెప్పుకుందుకు ఉత్సాహ పడతారు. బంధువుల్లోనూ, మిత్రుల్లోనూ తనకి ప్రతిష్ఠ. పరపతీ పుట్టించిన ఘనత మావగారిదే! తనకేమీ లేదు

అరె టైమయిపోతోందే! పనిమనిషి త్రోవలో వుండివుండాలి బహుశా వెళ్ళిపోదామా అంటే ఆత్మారాముడు ఆగమంటున్నాడు "హోటళ్ళలో అడ్డమైన గడ్డి తినేరు సుమండీ! ఆరోగ్యం చెడుతుంది" అంటో జానకి రాసే వార్నింగులు

స్వంత ఆరోగ్యం గురించి ఒక్కముక్కైనా రాయకుండా తనని జాగ్రత్తగా వుండమంటో హెచ్చరించే జానకి కోపమన్నా తను టిఫిన్లు తినడం మానాలి అసలీ హోటలు భోజనమే అధ్వాన్నంగావుంది మరి టిఫిన్లమాట చెప్పాలా? కూరలొకసారి వేసిన నూనెతోనే దోసెలు చేస్తారీ హోటల్ వాళ్లు దగ్గు పట్టుకుంటోందంటే పట్టుకోదూ? పావలా టిఫిను తింటే పదిరూపాయల మందులు వాడాలి

"సుబ్బులింకా రాదేం చెప్మా?" అనుకుంటో ఆనందరావు బయటికొచ్చి చూశాడు. దూరాన చేతిలో టిఫిను కారియర్‌తో ఎత్తు కడుపును మోసుకుంటూ వొచ్చే సుబ్బుల్ని చూశేకగాని అతని ఆతృత తగ్గలేదు

సుబ్బులింట్లో అడుగుపెడుతో "ఇయ్యాల మొవురో నలబైమందిదాక భోజనం సేసినారంటండి. అందుకోసం మల్లీ వోర్చి కారియర్లో యెట్టారంటి సాలామంది కియ్యాల ఆలస్యమై పోయిందంటి"—అన్నది.

జరిగిన ఆలస్యానికి తను గమరుకానని సుబ్బులు ఉపోద్ఘాతానికి నవ్వొచ్చింది ఆనందానికి

"ఏదో అయిందిలే. వేగం తగలడు"— అంటో తనే వడ్డించుకుని గబగబా భోంచేసి బయల్దేరాడు ఆనందరావు.

రాత్రి ఆనందరావు అలా బజార్లోకి వెళ్ళి వచ్చి భోజనంచేసి కుర్చీలో కూలబడ్డాడు. సుబ్బులు అంట్లు తోముతోంది దొడ్లో

ఆనందరావు వొదిలేసిన అన్నాన్ని తన గిన్నెలో పెట్టుకుని అప్పుడే వచ్చిన ముసలి తల్లి కిచ్చేసింది సుబ్బులు. తర్వాత ,మళ్ళీ అంట్లు!

అంట్లు తోముతున్నప్పుడు కదిలే సుబ్బులు అవయవాలు తన పాతజ్ఞాపకాల్ని స్మృతిపథంలోకి తెస్తున్నాయి—

ఆరోజున జానకి పండగకి పుట్టింటి కెళ్ళిన రోజున తనకు సెలవు దొరక్క అత్తవారింటికి వెళ్ళలేక వుండిపోయిన రోజున తనూ సుబ్బులూ యింట్లో-

జారిపోయే పైటని సుబ్బులు పైన కప్పుకుంటూంటే, తన అందాన్ని దాచుకుందుకు ప్రయత్నిస్తుంటే తను ఓర్పుతో వుండలేక పోయిన దృశ్యం జ్ఞాపక మొచ్చింది.

"సుబ్బులూ! ఇల్లారా ఒకసారి." అంటో పిలిచి దగ్గరకు వచ్చిన ఆమెచెయ్యి పట్టుకున్న సంఘటన మళ్ళా కదిలింది తన కళ్ళల్లో.

"ఇదేటి బాబయ్యా! సెయ్యట్టుకుంటారు! అంటూనే సుబ్బులు పైటని జార్చిన సంఘటన జ్ఞాపకంవొస్తే ఆమెకూడా ఎంత కాంక్షపూరితంగా వుందో అర్థమైంది

కాని తీరా తను లొంగిపోబోయే సమయానికి జానకి— "నాముఖం చూడండి!

నామీద మీకు ప్రేమలేదూ ?" అని ముఖం అడ్డుపెట్టి తనని ప్రశ్నిస్తోన్నట్టయింది

అవును జానకి తనని గాఢంగా ప్రేమించే జానకికోసం తను నిర్మలంగా వుండాలి పైగా తన యజమానిత్వం తనకీ, నుబ్బాలికీ అడ్డుగా వుంది

కావాలని మనసుని మళ్ళించాడు మరో వేపుకి - ఇట్లా యెన్నాళ్ళో తనకి హోటల్ మెతుకుల ప్రాప్తి! జానకి పురిటిరోజులు కూడా దగ్గిరపడు తున్నాయి నేడో రేపో టెలిగ్రాం రావాలికూడా. తమ ప్రేమకు శాశ్వత చిహ్నంగా బిడ్డని తేటోతోంది జానకి తమ యిద్దరి ప్రేమల్లోంచీ సగం సగం లాక్కొవడానికి మరోవ్యక్తి తయారౌతున్నాడు

• • •

అబ్బాయి పుట్టినట్టు మామగారిచ్చిన టెలిగ్రాం చూసుకున్న ఆనందరావుకి - శోభనంకోసం యెదురుచూసే కన్యకికి ముహూర్తం లేకండానే ప్రియుడు కౌగిలించు కున్నప్పుడు కలిగినంత సంతోషం కలిగింది. కనబడిన వాళ్ళందరికీ తోమా చెప్పుకుని కరచా లన లందుకుని టీపార్టీలు యిస్తానని హామీలు కూడా యిచ్చుకున్నాడు తన వంశోద్ధారకుని జననం జ్ఞాపకార్థం మిత్రులందరూ తిపితిపిగా తడిచేసుకోవాలనిపించింది.

• • •

'కాలం' అండి 'రోజు' ల చక్రాలు దొర్లు తున్నాయి 'లోకం' రోడ్లమీద మంచి ముహూర్త మెప్పుడొస్తుందా, అబ్బాయి నెప్పుడు చూస్తానా అనే ఆత్రుతతో వున్నారు ఆనందరావు.

ఆనాటి సాయంత్రం వచ్చిన ఎక్స్‌ప్రెస్ పుత్తరం చూసుకున్న అతనికి ఆరాత్రల్లా నిద్రపట్టలేదు - 'రేపు మెయిల్లో జానకినీ, అబ్బాయినీ తీసుకుని వొస్తున్నాను' - అంటో రాశారు మావఁగారు ఆ రేపు యిప్పుడే వొచ్చెయ్యకూడదూ ?

అబ్బాయిని చూడాలనే ఆత్రుతతో తను వుంటే స్టేషనుకు రావద్దనీ, శాంతులు జరిపిం చేక గాని అబ్బాయిముఖం చూడగూడదనీ మామగారు రాశారు. ఏమిటో యీశాంతులూ, వాంతులూ ?

మామగారుండటం మూలాన అన్నీ యధా విధిగా పూర్తయ్యాయి ఆనందరావు అబ్బాయి నెత్తుతున్నాడు ఓ నెల్లాళ్ళవరకూ తానిక్కడే వుండి వెడతానని మామగారంటే యెంతో ఆనందించాడు.

'సమయంలో సంగీతమని పనిమనిషి కూడా అయిదు రోజులనించీ రావడం మానే సిందండీ!'- అన్నాడు ఆనందరావు మామ గారితో

'పోనీలెస్తూ! మరోమనిషిని పెట్టుకో వచ్చును ఇంటి విషయం గురించి నువ్వేమీ మధనపడకబ్బాయ్' అన్నాడాయన.

అంతహామీ తనకి మామగారిస్తోంటే యింకేం కావాలి? చీకూ చింతా లేకుండా ఆఫీసుకెళ్ళి రావచ్చును తను.

ఆఫీసునుంచి తను తిరిగి వచ్చేసరికి ముస లమ్మనొకతెను పనిమనిషిగా కుదర్చడం, ఉయ్యాల వెయ్యడం, అబ్బాయి అందులో పడుకుని కేరింతలు కొట్టడం - యిన్ని విష యాల నొక్కసారి చూశాడు ఆనందరావు

ఆడుకుంటోన్న అబ్బాయి నెత్తుకున్నాడు. అబ్బాయి నెత్తుకుంటే అదోరకమైన ఆనందం తనకి అందరు తండ్రులూ యిలాగే ఆనంద మనుభవిస్తారు గాబోలు అనిపించింది.

మూడు రోజులు గడిచి పోయాయి. ఎలా గడిచాయో ఎవరికీ తెలీదు

జానకి ఆనందరావుని సమీపించి - 'సుబ్బులు పిల్లని కన్నదటండీ!' అన్నది

"అయితే మనకి పండగా!" అన్నాడు ఆనందరావు

"మీకు మరీ హాస్యాలు పిల్లతండ్రయిన దగ్గిరనించీ మీకు పరసాలెక్కువౌతున్నాయి" అంటూ వయ్యారంగా లోపలికి వెళ్ళిపోయింది జానకి

సాయంత్రం ఆనందరావు మామగారితో ముందుగదిలో కూచుని మాట్లాడుతూంటే బిడ్డనెత్తుకుని సుబ్బులొచ్చింది "ఆనందరావు బాబూ! ఆనందరావు బాబూ! ఓ ఆనందరావు బాబూ! అంటూ గట్టిగా కేకేసింది"

"ఏం కావాలి?" అన్నాడు ఆనందరావు మామగారు పరంధామయ్య

సుబ్బులు బయటినుంచే- "ఆనందరావు బాబుని బయటికి పిలవండి మీరుకూడా రండి బాబూ!"- అన్నది

"డబ్బులప్పుడే యిచ్చేశాముగా!" అంటూ ఆనందరావు బయటికి వచ్చాడు పరంధామయ్యగారుకూడా బయటికి వచ్చారు. సుబ్బులు కేకలువిన్న జానకికూడా వొచ్చి నిల్చుంది

"ఇందండి బాబూ! మీబిడ్డ!" అంటూ సుబ్బులు పిల్లని గచ్చుమీద వుంచింది

"నా బిడ్డేమిటి? అన్నాడు ఆనందరావు ఆశ్చర్యంగా.

ఈ గలాటాకప్పుడే అంతా చేరారు చుట్టూ. దానిమాటలు గట్టిగా వినబడటంతోనే యెవరైనా చుట్టూ చేరతారు

సొంత విషయాలని పరిష్కారం చేసుకోలేని వాళ్ళకిసైతం యితర్లని హీనపరిచే సంగతులు తెలుసుకోవడమంటే చాలామందికి సరదా! అది మానవనైజం!

"అమ్మగోరు పండుక్కి ఊరికెళ్ళినప్పుడు " అంటూ పరంధామయ్య నుద్దేశించి సుబ్బులేదో చెప్పబోతోంటే కోపం పట్టలేకపోయాడు ఆనందరావు పరంధామయ్యకు కూడా కోపమొచ్చి కొట్టాలనిపించింది సుబ్బుల్ని దానిమాటలు నిజమేనేమోననే అనుమానం పరంధామయ్య చేతిని లేవకుండా కట్టేసింది

నిజానికి సుబ్బుల్ని చూసిన యెవరికైనా నమ్మకం కలుగుతుంది యిది జరుగవచ్చునని- మెలికలు తిరిగిన పాములాగా వంపులు తిరుగుతూన్న శరీరం, తైలసంస్కారం లేకపోయినా కొత్త అందాన్ని తెచ్చే కేశసంచయం అజంతా చిత్రాల్లాగా ముందుకొచ్చే కుచద్వయం మాసిన బట్టలైనా శరీరానికేమీ లోపంలేదన్నట్లు అవయవ సౌష్ఠవం— యివన్నీ చూసిన యెవరైనా నమ్మగలరు అందునా మొన్నమొన్నటి వరకూ సుబ్బులు వాళ్ళింటో పనిమనిషిగా పనిచేసింది

మండిపోతోన్న మంటలాగా జ్వలించే కళ్ళతో కోపపు నిప్పులొలంకబోస్తో వరంధామయ్య అన్నారు— "దొంగముండా! నీ మొగుడికి పుట్టిన పిల్ల నద్దుపెట్టుకుని అందర్నీ రచ్చ కెక్కిద్దామనుకున్నావుటే! నీకు బ్రతుకు తెరువు లేకుండా చేసెయ్యగలను జాగ్రత్త"

"నా మొగుడితో దెబ్బలాడుకుని సంవత్సరమయింది బాబు! ఇదంతా మీయల్లుడిగోరి గనకార్యమని చెప్పుకోలేక మద్దిని నామీద కోపమై పోతారేటి?" అంది సుబ్బులు ధైర్యంతో.

"ఆయెదవ పచ్చినోడు దాన్నొదిలేసి యేడాదయిందండి"- అప్పుడే వచ్చిన

సుబ్బులు ముసలి తల్లి కూతుర్ని సమర్థిస్తూ అంది

తనకూతురు పరువు మంట గలుస్తున్నదేమో ననిపించింది పరంధామయ్యకి. ఎంతో బుద్ధిమంతుడనుకున్న తన అల్లుడిలా తయారయాడంటే నమ్మకం కలగటం లేదు అయినా తన వెర్రిగాని దేవతలే విగ్రహంతో వుండలేకపోయాక మానవమాత్రులు లొంగకుండా వుంటారా? అనిపించింది

'నా పరువు నిలుపు నాన్నా!' అంటున్నట్టు జాలిగా వున్నాయి కూతురు చూపులు 'అవును ఏదోవిధంగా యింత దీని నోరు మూయించాలి తద్వారా నా ప్రతిష్ఠని కాపాడుకోవాలి' అని నిశ్చయం చేసుకున్నాడు పరంధామయ్య

"ఇదో ఏమిటి నీపేరు?- సుబ్బులా! బంగారంలాంటి నా అల్లుడికి యిలాంటి అప్రతిష్ఠ తేవడానికి ప్రయత్నిస్తే ఒళ్ళు చీరేస్తాను జాగ్రత్త —" అన్నాడు కోపంగా భయపెట్టయినా కార్యం సాధించాలని

"మీ అల్లుడిగారి గనకార్యం మీకేటి తెలుసును బాబూ? అలాంటోళ్ళు ఆ బాబునే కూకలేసుకోండి" నిబ్బరంగా యెదుర్కొంది సుబ్బులు

పరంధామయ్య ఒక్కసారి అల్లుడివేపు చూశాడు తన సుబ్బులు చెయ్యిపట్టుకులాగిన సంఘటన మెదుల్తోంది మనసులో ఆనందరావుకి సిగ్గుతో తలవంచుకునివున్న ఆనందరావుని చూశాక పరంధామయ్యకి కూడా సుబ్బులు మాటల్లో నమ్మకం కలుగకపోలేదు.

"సుబ్బులక్ష్మి, లోపలికిరా వొకసారి" అంటూ పరంధామయ్య ఆదరం వొలకబోస్తూ సుబ్బుల్ని లోపలికి తీసుకుపొయ్యాడు

ఇంత ఆదరంగా లోపలికి తీసుకెళ్ళడం చూసిన జనమంతా నిజమేననుకుని యెవళ్ళతోవన వాళ్ళు జారుకున్నారు ఏమాత్రం సందుకనపడ్డా లోకం అనుమానిస్తోనే వుంటుంది మనుషుల్ని అది నిజమే ననుకుని సంతృప్తి పడుతుంది కూడా

ఆనందరావు జీవితంలో విషాదకరమైన సంఘటన యిదే ప్రథమం లోపలికి వెళ్ళిపోయి పడకగదిలో మంచమ్మీద వాలిపోయాడు అతని కళ్ళవెంట నీళ్ళు రావడం లేదుగాని మనసులో నీళ్ళు మరుగుతున్నంత సంక్షోభం కదుల్తోంది

పరంధామయ్య సుబ్బుల్ని కూచోమని చెప్పి - "ఇదిగో సుబ్బులూ! అనవసరంగా నాకూతురు పరువు బయటపెట్టడం వలన నీకేమీ కలిసిరాదు మా అల్లుడే దొరికాడా నువ్వీ నింద మోపటానికి"— అన్నాడు

"అదేటి బాబూ! మీయల్లుడు దేవుడన్నట్టు మాటాడతారు! బగవంతుడికే లేదు అంత నిగ్గరం"

"సరేగాని యీ యాభై తీసుకుని యింటికెళ్ళిపో! మళ్ళ యీ సంగతెవరితోనైనా అన్నావో వొళ్ళు హూనం చేసేస్తాను తెలిసిందా?" అన్నాడు పరంధామయ్య అయిదు పదులు పెట్లోంచి తీసి యిస్తో

"ఇదేటి బాబూ? యాబయి రూపాయల్తోటి యీ అపరిదిష్ట లేకుండా సేసేద్దామనుకున్నారేటి? మీ అల్లుడిగారి గనకార్యానికి నన్నెవుకెట్టుకుంటారు బాబూ నన్నో? ? నా కూట్లో మట్టిగొట్టాడు బాబో!" అంటూ గట్టిగా యేడవడం ప్రారంభించింది.

"ష! ఓసీ మరో యాభై తీసుకో మరి నోరెత్తితే చంపేస్తానన్నమాట. నిన్ను

నాశనం చేయ్యాలంటే నిముషం పట్టదు తెలిసిందా?" అన్నాడు పరంధామయ్య బెదిరిస్తో

"ఏటిబాబూ? నాకిదేవీఁ వొద్దు మీ బిడ్డని మీరే తీసుకోండి బాబూ! నాకు డబ్బూ వొద్దు యేవీఁ వొద్దు-" అంటో బిడ్డనక్కడే వొదిలేసి వెళ్ళిపోబోతోంది సుబ్బులు

"సుబ్బులూ! మరి నీ ఆశకి అంతంటూ కనబడటం లేదు ఒక్కమాట ఆఖరిసారిగా చెప్పేస్తున్నాను దానికొప్పుకోక పోయేవో నీఅంతుచూస్తాను.ఇదో ఇటుచూడు" అన్నాడు పరంధామయ్య ముఖం మరోవేపుకి తిప్పుకున్న సుబ్బుల్తో- "రెండు వందలిస్తాను తీసుకుని మారుమాటాడకుండా వెళ్ళిపో! మళ్ళీ యెవరితోనైనా యీమాట నువ్వన్నట్టు తెలిస్తే మరి యేంచేస్తానో తెలుసా?" అంటో యిరవై పదిరూపాయలనోట్లు తెచ్చియిచ్చాడు పరంధామయ్య

తీసుకోనకుండా యింకా అల్లరిచేస్తే తన నింకేం చేసిపోతాడోననే భయంతో తీసుకుంది సుబ్బులు - "ఊఁ! నీబిడ్డని తీసుకుని వెళ్ళిపో! మళ్ళీ యిటువేపు తొంగి చూశావో చమ్డా లొలిచేస్తాను" హుంకరించాడు పరంధామయ్య

సుబ్బులు బిడ్డనెత్తుకొని వెళ్ళిపోయింది కాని అది తెచ్చిపెట్టిపోయిన తుఫానుమాత్రం ఆ యింటిని వూపేస్తోంది

పరంధామయ్య పడకగదిలోవున్న ఆనంద రావు దగ్గరకి వచ్చాడు

"అబ్బాయ్! నన్ను నలుగుర్లోనూ మరి తలెత్తుకు తిరగకుండా చేశావు. ఇప్పటికైనా నిజం చెబుదూ!" - అన్నాడు చిరాకుగా పరంధామయ్య

"నేను నిజం చెప్పినా మీరు నమ్మలేరు స్త్రీ కంటె పురుషుడే తేలిక బుద్ధి గలవాడనే అభిప్రాయా న్నంటిపెట్టుకుని వున్నంతకాలం మీరు నేనేం చెప్పినా నమ్మలేరు"

"అదికాదు ఆనందం! క్షణికమయిన ఆ ఆనందంకోసం పురుషుడేగాని, స్త్రీయే గాని లొంగిపోవడం సహజం కాని స్త్రీల కంటె పురుషుడికి ఉద్రేకం సహజంగా యెక్కువైనందున లోకం నిన్నే అనుమాని స్తోంది ఇప్పటికైయినా నిజం చెప్పు సంతో షిస్తాను"

"నాకేపాపమూ తెలీదు అంతకన్నా యింకేం చెప్పమన్నారు మావఁగారూ?"

"అయితే నిజం చెప్పదలచుకోలేదన్న మాట కొంతగాకపోతే కొంతైనా నిజం లేక పోతే అది నడిరోడ్డుమీద 'నీబిడ్డ' అంటూ పారెయ్యగలుగుతుందా? ఇదిగో ఆనందం! ఇంతవరకూ నీ ప్రవర్తనమీద, శీలంమీద గొప్ప అభిప్రాయంతో వుంటూ వచ్చాను. అది కాస్తా యీనాటితో పూడిపోయింది. ఇప్పటి నుంచయినా బుద్ధిగా మసలుకొని ఆదంతా వొట్టిదని నిరూపించుకో! ఇంత కంటె నే చెప్పాల్సిందేమీ లేదు"-క్రుద్ధస్వరం లోనే పరంధామయ్య అనేసి వెళ్ళిపోయాడు బయటికి

వేలరాస్తూ అక్కడే నిల్చుని అంతా వింటున్న జానకి భర్తదగ్గిరగా వొచ్చింది

"ఏమండీ! మీరింతగా ప్రేమించే నాతో నన్నా నిజం చెప్పరూ? అబ్బాయిమీద ఒట్టేసి చెప్పండీ!" - అన్నది జానకి అనునయ పూర్వకంగా.

"జానకీ! నన్ను నమ్మలేనిదానవు అడిగి మాత్ర మేం ప్రయోజనం? ఆడవాళ్ళుకూడా

తొందర పడుతూంటారని గుర్తించేక నన్నడిగితే నువ్వు నమ్మగలవు "

"ఆడవాళ్ళెప్పుడూ తొందర పడరు తప్పులు చెయ్యరు ఉద్రేకమంతా మగాళ్ళదే ఎవరు తొందరపడ్డా మీరాపని చేశారో లేదో చెప్పండి మీకాళ్ళు పట్టుకుంటాను నాపరువు నాకిచ్చినవారి ప్రతిష్ఠ నిలపండి " ప్రార్థిస్తూనే జానకి దగ్గిరగా వచ్చింది

"ఆడవాళ్ళ విగ్రహంమీద అంత విశ్వాసం వున్న నీకేం చెప్పినా నమ్మకం కలుగదు అది యిలాంటి దొంగవేషాలు వేస్తుందని తెలుస్తే అసలు పనిలోనే పెటకపోయి వుండేవాణ్ణి. అందునా నువ్వు వూరికి వెళ్ళిపోయాక అసలు వుంచకనే పోయేవాణ్ణి "

"మీది వేషాలో దానిది వేషాలో తెలుస్తూనేవుంది పిల్ల రూపురేఖలన్నీ మీకు మల్లేనే కనిపిస్తోంటే- ఎంత దాచినా దాగుతుందనుకుంటున్నారా "

"అనుమానంతో చూసేవాళ్ళ కళ్ళకంతా అట్లాగే కలిపిస్తుంది "

"మనిషికి సిగ్గూ బిడియం అనేవి రెండు వుండబట్టే పశువుకంటె ఉత్కృష్టుడనిపించుకుంటున్నాడు ఆ రెండూ వొదిలేస్తే పశువుకీ, మనిషికీ యేం భేదం?" ఇంక నలుగుర్లో నేను పేరంటాలకి వెళ్ళనక్కరలేదు కలిసి తిరగనక్కరలేదు మీరుచేసినఘనకార్యానికి "

"జానకీ!" అని గట్టిగా అరిచాడు. ఆనందరావు "ఇంక నువ్వేమన్నా వినలేను" అంటూ బయటికి వెళ్ళిపోయాడు

"అవును మరి ఎలా వింటారు?" అయితే మనకి పండగా?" అన్నప్పుడిదే సూచనని తెలుసుకోలేక పోయాను ఇంత మందాయన యిలా తయారయాడంటే నేను చేసుకున్న అపరాధమే! నేను లేకపోవడమే సందుగా భయం వసించింది " అంటో వొచ్చే కన్నీళ్ళను కోపం తెరలతో ఆపుకున్నది జానకి "అవును ఆడవాళ్ళెప్పుడూ తొందర పడరు తప్పులు చెయ్యరు వాళ్ళకి నిదానమెక్కువ మగాడికే ఉద్రేకం! ఆ ఉద్రేకాన్నాపుకోగల విగ్రహం లేదతనిలో!

బయటికి వెళ్ళిన పరంధామయ్య ముఖం కిందికి దించుకుని యింట్లో మెల్లిగా అడుగు పెడుతోంటే ఏమనాలో తెలీలేదు జానకికి. తన భర్తచేసిన చిన్న పొరబాటుకి వంశప్రతిష్ఠంతా సర్వ నాశనమైపోయింది. తలలో నాలుకగా మెలగుతూన్న తండ్రి యింక తలెత్తుకు తిరగలేని పరిస్థితి వొచ్చింది తను మాత్రం యేమని ఓదార్చగలదు?

"అమ్మా జానకీ! ఏమన్నా చెప్పాడా ఆ దుర్మార్గుడు?" అడిగారు పరంధామయ్య

"లేదునాన్నా! నాకేం తెలీదంటున్నాడు. నాకు కూడా నమ్మకం కలగటంలేదు "

"ఇదంతా నొసటిరాత తల్లీ! పండంటి సంసారాన్ని బూడిదపాలు చెయ్యమని రాముడు రాసి వున్నట్లున్నాడు దాన్ని మన మంతా కలిసి ఆపెయ్యగలమా? ఎవరెన్ని విధాల చెప్పినా రాముడే విధం రాస్తే యివన్నీ ఆగుతాయా తల్లీ? ఇంక నేను వెళ్ళిపోతా నింటికి జాగ్రత్తగా మెసులుకో" అంటూ సామాను సర్దుతున్నారు పరంధామయ్య

"ఆయన రానివ్వండి నాన్నా వెళుదురు గాని "

"మళ్ళీ వాడితో చెప్పి వెళ్ళడం కూడానా? వాడిముఖం చూస్తేనే పాపం! ఈమాట అన్నానని చెప్పు బిడ్డ ఆరోగ్యం జాగ్రత్త సుమీ!" అంటో హెచ్చరిస్తూనే యాభయి

రూపాయలు కూతురు చేతిలో పెట్టి బెడ్డింగు పట్టుకుని రిక్షలో వేసుకున్నాడు

"నువ్వు వెళ్ళిపోతే నాకింకెవరు నాన్నా దిక్కు?" అంటూ కన్నీటితో సాగనంపుతూన్న కూతుర్ని చూసేక పరంధామయ్యకి కళ్ళనీళ్ళాగలేదు ఎవరికీ కనబడకుండా నీళ్ళొత్తుకుని 'పోనీవోయ్ రిక్షా' అన్నాడు మెల్లిగా

ఆనందరావు తిరిగి యింటికి వొచ్చేసరికి జానకి మంచమ్మీద పడుకుని యేడుస్తోంది. మామగారి బెడ్డింగు సామాన్లుగలచోటు ఖాళీగావుంది

"జానకీ! మీ నాన్నేడీ?"

"మీ ముఖం చూడలేక వెళ్ళిపోయాడు".- అన్నది తెచ్చుకుంటోన్న కోపంతో యెరుపెక్కుతూన్న జానకి.

ఆయనకూడా తనమీద కత్తి కట్టాడన్న మాట! జానకి మాటల్లోకూడా వ్యంగ్యం, చులకనభావం ప్రస్ఫుటమౌతోనేవుంది ఇంతవరకూ తనకి కుటుంబమంతా యిచ్చేగౌరవం ఒక్క నిముషంలో మాయమైంది.

అనుకోని సంఘటనలు కొన్ని యెదురౌతాయి ప్రతి వ్యక్తికి వాటిలో కొన్ని మనిషిని ఆనందంలో ముంచి తేలుస్తాయి మరికొన్ని దుఃఖసాగరంలోకి, అఖాతాల్లోకి విసిరి పారేస్తాయి

తనకి సంభవించిన యీ సంఘటన రెండో రకానిది లోటంటే యేమిటో యెరుగని తన సాంసారిక జీవితంలో ఒక విషవు బొట్టు. తను యిందులో చెయ్యగలిగిందేముంది? తను నిమిత్తమాత్రుడు. నిజానిజాలు తేల్చడానికి లోకం పక్షపాతి ముల్లు వెళ్ళి అరటాకుమీద పడినా, లేక అరటాకు వెళ్ళి ముల్లుమీద పడినా అరటాకుకే ముప్పు. తనపని అరటాకుచందమైంది. పురుషునిమీద లోకానికేమీ సానుభూతి లేదు కనీసం సానుభూతితోనయినా వాణ్ణి అర్థం చేసుకోలేదు.

రోజుల మైలురాళ్ళు గడుస్తున్నాయి జీవితయానంలో జానకి తనని నౌకరు కంటె హీనంగా చూస్తోంది తనమాటకి విలువనివ్వకపోవడమేగాక ఎదురు ప్రశ్నలూ, సూటిపోటు మాటలూ విసురుతుంది మామగారు సరేసరి. చెప్పకుండానే వెళ్ళిపోయారు. తను ఆఫీసులో కెళ్ళేసరికల్లా యిదివరకుండే గౌరవమంతా పోయి గుసగుసలాడుకోవడం. తనకు వినబడాలన్నట్టు గట్టిగా వ్యంగ్యంగా మాట్లాడ్డం జరుగుతోంది తరుచు బంధువులకెలా తెలిసిందో దూరానవున్న వాళ్ళకి సైతం! ఇట్లాంటి వార్తల్ని మోసుకుపోవడమంటే కూడా గాలికి సరదా గావును!

ఎంతో ఆప్యాయతతో పలకరించే బంధువులంతా తప్పుకు తిరుగు తున్నారు మరికొద్దిమంది నిలదీసి అడిగేస్తున్నారు. ఏం సమాధానం చెప్పినా తన మాటల్ని నమ్మలేకుండా వున్నారు అటువంటివాళ్ళ తన నడగటమెందుకో! మిత్రుల్లోకూడా తను అలుసైపోయాడు

లోకమంతా తనని హేళన చేస్తోంది? ఎందుకు? వ్యభిచారం తప్పనే నీతిని తనకి యెక్కించడానికి అవును తప్పే!- తనూ అంగీకరిస్తున్నాడు. తన అంగీకారాన్ని లెఖ్ఖలోకి తీసుకోదేం? తానేపాపమూ యెరుగనంటే నమ్మదేం?

'లోకానికి చెవులున్నాయి గాని కళ్ళు లేవు' అది అక్షరాలా నిజం. విన్నదంతా నిజమేనని నమ్మడానికి దానికెట్టి అత్యంతరాలా లేవు, అది చెడుగైతేనే మళ్ళీ!

సమయానికి భోజనం తయారుగాకపోవడం, టైమయిపోతోందని భోంచెయ్య

ఉండానే ఆఫీసుకు పోవడం సంభవిస్తూంది తరుచు దీని కంతటికీ కారణం తనేనంటుంది భార్యా. లోకమూ కలిసి తానొక్కడూ కాదంటున్నాడు హోటల్లో ఆరోగ్యం చెడుతుందని టిఫిను తినకుండా వుంటూ వచ్చిన తనకిప్పుడదే అవలంబనమైంది. మరి గత్యంతరంలేదు

భార్యా వియోగం సంభవించిన వాళ్ళకీ కుటుంబ కలహాలకు గురైన వాళ్ళకీ అందరూ యెదురు తిరిగితే ఆదరించేది హోటల్‌వాళ్ళే; వాళ్ళే తనపట్ల సానుభూతితో డబ్బు పుచ్చుకొనైనా తిండి పెడుతున్నారు

ఏమిటీ పరీక్ష తనకి ? సరే నిజంగా తన సంయోగం వల్లనే ఆదిత్య పుట్టిందనుకుందాం తప్పా ? భార్యలేని లోటును ఆమె తీరుస్తే తప్పా ? తనలోటును లేకుండా చేసినందుకు జానకికి సుబ్బులుపైన యీర్ష్యా ? తనకి లభించిన ఆనందం తమకు దక్కలేదని లోకానికి యీర్ష్య ఇందులో తప్పేముందో తెలియడం లేదు.

అయినా తను దోషి అయితే గనుక యింత రాద్ధాంతానికి ! తన నిర్దోషిత్వాన్ని అంగీకరించడానికి అడ్డుగా లోకానికి అబలల మాట లున్నాయి. వారి మాటలకి బల మెక్కువ లోకం దృష్టిలో

కేలండర్లు మారాయి రెండు లోకానికి లెక్క రెండు సంవత్సరాలు ! రోజులెలా నెట్టుకొస్తున్నాడో తనకే తెలీని స్థితిలో వున్నాడు ఆనందరావు

నిత్యమూ మనోఘర్షణతో తర్జన భర్జనల్తో చివరికొక నిర్ణయాని కొచ్చేశాడు. ఆనందరావు - తను సత్యాన్ని నిరూపించడానికి ముక్కుకు సూటిగా నియర్దేరి తాపత్రయ పడితే తిరిగి మరింత క్రిందకు త్రొక్కివెయ్యబడుతున్నారు కాని క్రిందినుంచి మీదికి యెదురీదడానికి ప్రయత్నించాలి ఆపని చేసి వున్నా తప్పుకాదనే వాదనతో ప్రారంభించాలి అవసరమైతే సుబ్బుల్ని పెళ్ళాడగల నని నిరూపించాలి.

మనిషి పరిస్థితులకూ సంఘానికి విలువిచ్చి చాలావరకు సర్దుకుపోవాలని ప్రయత్నిస్తాడు. కాని అది హద్దుమీరి వ్యక్తిని నలిపెయ్యడం ప్రారంభించినప్పుడు ఆ వ్యక్తి లోంచే విప్లవం బయలుదేరుతుంది మరి ఆ విప్లవాన్ని ఆపడాని కింకెవరికీ సాధ్య పడదు

కృతనిశ్చయంతో యింటికి వెళ్ళారు ఆనందరావు రాత్రిభోజనం చాలా ఆదరంతో పెట్టింది జానకి ఆమెలో యింతమార్పు కలగడానికి కారణమేమిటో అంతుపట్టలేదు భోజనానంతరం తమలపాకు చిలకల్ని చుట్టి అందిస్తో జానకి అంది-" విన్నారా మీరీ సంగతి ?

"నేను వినవలసినవన్నీ అహూతై పోయాయి, నా నిర్లక్ష్యానికి ఇంక వినాల్సిన అవసరంలేదు జానకీ ! లోకమంతా నన్ను దోషిగానే భావిస్తున్నప్పుడింకా చెప్పి యెందుకు నన్ను బాధపెడతావు ?" అన్నాడు ఆనందరావు చిరాకును ప్రతిబింబిస్తో

"అది కాదండీ ! అమ్మంత సుబ్బులు సంగతి "

అయితే అసలే వినదలచుకోలేదు."

"కాదండి సుబ్బులు మనింట్లో చేసినట్టే మరో యింట్లోకూడా చేసిందటండీ !"

"ఆడవాళ్ళెప్పుడూ తొందరపడరు తప్పులు చెయ్యరు జానకీ !"

జానకి నొక్కించి - "చెయ్యరా? అలా అనకండీ !"- అన్నది కళ్ళనీళ్ళు పెట్టుకుంటో.

"చేస్తే మనయిల్లు యీ రేండేళ్ళూ నరక మెందుకౌతుంది ?"

"లేదు లెంపలు వాయించుకుంటున్నాను ఆడవాళ్ళుకూడా తప్పులు చేస్తారు మిమ్మల్ని బాధపెట్టినందుకు నన్ను మన్నించండి "

"అసలేం జరిగిందో, నా నిర్దోషిత్వం యెల్లా బుజువయిందో తెలీకుండానే ఎలా మన్నిస్తాను జానకీ ?"

"అది కాదండీ ! వనిలో ప్రవేశించి అయిదు నెలలైనా కాకుండానే చిన్న పిల్లని తీసుకెళ్ళి 'నీకు పుట్టింది'- అంటో ఆ యిల్లు గలవాళ్లమీద పారేసిందిటండీ ! తనకి పుడు తోన్న పిల్లల్తో వెయ్యదలచుకున్న వ్యాపారాని కిదొక యెత్తని గ్రహించి ఘోరంగా చిదక బొడిచారట"- అన్నది జానకి వొచ్చేనవ్వుని విలుపుగుంటూ.

"ఇప్పుడు విజం చెప్పినా నమ్మగలవు గనక విను నన్ను లోబరచుకోవాలని నుబ్బులు ప్రయత్నించినమాట వాస్తవం. నేనుకూడా లొంగిపోవాల్సినవాణ్ణే ! కాని నీ జ్ఞాపకం, నీ ప్రేమ, నీ సేవ నన్ను నిర్మలంగా వుంచగలిగాయి మన బంగారం మంచిదైతే కంసాలి ననాల్సిన పనేముంది జానకీ ? అనుమానం అంటో తట్టినా అది మన బంగారం మీదే అయివుండాలి ఏమంటావ్ ?"

"అవునంటాను ఇదిగో బాబు మీదగ్గిర కొస్తానంటున్నాడు ఎత్తుకోండి" - అంటో కొడుకునందించింది భర్తకి తను లోపలికి వెళ్ళిపోయింది జానకి

ఇన్నాళ్ళనించీ తన దగ్గరకు రాకుండా చేసిన కొడుకు నిప్పుడు ఆనందంతో యెత్తుకుంటున్నాడు

అబ్బాయిని ముద్దాడి వాళ్ళమ్మదగ్గిరకి వెళ్ళమని చెప్పి పంపించేసి తనలో గట్టిగా అనుకున్నాడు ఆనందరావు

"ఆడవాళ్ళెప్పుడూ తప్పులు చెయ్యరు. తొందరపడరు మగాళ్ళకే ఉద్రేకమెక్కువ."



శీమదుత్తయాం :

# శాద్వలము

"స్ఫూర్తిశ్రీ"

జలదకుమారి మానసము శాద్వల మందున విప్పిపోసి "యే
వలపును లేని జీవితము వ్యర్థము వ్యర్థ" మటంచు పల్కె ; క
న్నుల చలువయ్యె శాద్వలము నూతన కాంతుల తేజరిల్లి ; కా
గలనొకొ ! నేనునొక్క సురకామినికిం దగు పచ్చపట్టుగా.

పొలుపగు పచ్చగడ్డి పరపుల్ గని ముచ్చట నొంది మెచ్చు వే
ళల నల నల్ల నింగి తెరలం గనినంతట రోత పుట్టు ; క్రొం
దలపులు నారువోసి కొను తన్వుల గూడి విహార యాత్రలన్
మెలగెద మిప్పుడే , పిదప మెత్తని శాద్వల మౌదు మెక్కడో !

నా మది లే గులాబి వదనంబున మూగిన గుర్తువచ్చె నా
ప్రేమకు యోగ్యురాలు పృథివీస్థలి నొక్కతె యున్నదంచు ; నా
కామిత పూర్తికిన్ బహుముఖమ్ముల యత్న మొనర్తు నింద్రియ
గ్రామము స్వాత్మలీనముగ రాపడి నిల్వక ముందె నెచ్చెలీ !

పూల పరీమళమ్ము తలపోసిన, కంటక బాధ యెంత ? నీ
లాలక ముద్దు ముచ్చటల నందిన, నా శ్రమ యెంతపాటి ? ని
ద్రాలస మైన రాత్రి చనినంత లభించు మధూళి ముంది, త
త్కాల నిరీక్ష యేమగును ? ధారుణి లాభము నష్టమిట్టివే !

నేడిట తాప శైత్యముల నిండుదనంబు తొలంగె ; నింగి పా
రాడెడు మేఘముల్ కురిసె రాగముతో పువుదోటపై ; "సుఖ
క్రీడకు తావలం బయిన ప్రేమను మాకిడు" మంచు పాటలన్
బాడెను గాయకోత్తముడు పచ్చగులాబిని బుజ్జగించుచున్.

"నా యానందము గాంచి నీవు మది నున్మాదంబు పెంపొందె నే
మో యంచున్ దలపోయవచ్చును సఖీ! ఉద్యానపుం బాటలో
నా యారాధన గుండె చీల్చుకొని కొన్నాళ్ళె నిరీక్షింతు ; నా
ఆయాసంబన రక్తవస్త్ర మన హాస్యం బేల ? పో పొ"మ్మనెన్

నీ ముఖ శోభ గైకొని వనిం దళుకొత్తు గులాబి కన్నెయున్ ;
నీ మధురాధరా మృతము నింపుకొనున్ దనలోన మద్యమున్ ;
నా మన మట్లె యీ ప్రకృతి నాట్య మొనర్చు ; విరాళితో సురా
కామనతో నిరంతరము కాలము నిట్టులె త్రోసిపుచ్చెదన్

నీ మధురాధరాసవమునే పరిభూతము సేయబూని పో!
ఈ మధు వెంత మెట్టిన వహించినదే! భవదీయ దివ్య లీ
లా మహనీయతం బ్రతుకు లాభము నంది పరాకు గాంచె నే
మో! మొదలంట ద్రాక్షరస మూపిరి పీల్చెము, శిక్షయౌనదే!

ఎచ్చటినుండి వచ్చుటయొ ? ఎచ్చటి కేగుటయో యెరుంగ ; ఈ
ముచ్చట లేమిటో ? ఎవని మోదము కోసము చేయుచుంటినో ?
వెచ్చని గోస్తనీరసము వేడుక మీర గ్రహించి శాంతితో
మచ్చరికించు జీవిత సనుస్య కవశ్యము స్వస్తి పల్కెదన్.

పెదవి చురుక్కునం గౌరికి పృచ్ఛ యొనర్చితి పానపాత్రికన్
"బ్రదుకు రహస్యముం దెలిపి భారము దూరము చేయు" మంచు ; "ఆ
పదలకు కారణంబగు వివాదము జోలికి పోక ప్రీతితో
బ్రదికిన నాల్గునాళ్ళు మదుపానము సేయు" మటంచు పల్కెతాన్.



వ్యాసము :

# ఆంధ్రవచనం

— శ్రీ యం. కులశేఖరరావు, ఎం. ఏ.

ఆంధ్ర వాఙ్మయమునందలి యితర కావ్యప్రక్రియలవలెనే ఆంధ్ర వచన రచనలు కూడ సంస్కృతభాషాచ్ఛాయలనే నడచినది. సంస్కృతభాషాసంప్రదాయము ననుసరించియే తెలుగున రచింపబడిన ఛందోరహిత పదజాలమును గద్యమని పేర్కొనిరి. కేవలము గద్యరచనలు, చంపూ గ్రంథములు ఆంధ్రభాషపై సంస్కృతప్రభావమును వెల్లడించును.

నిశ్ఛందమై, నియమితపరిమితి లేని వాక్యరచనకు తెలుగున వచనము గద్యము అను పేర్లు కానవచ్చుచున్నవి ఈ రెండు శబ్దములు మౌలికముగా సంస్కృతమునుండి గ్రహింపబడినవే ఐన, నీ రెండు పదములు కేవలము సమానార్థకములా, లేక వీనికేదైన భిన్నత్వమున్నదా యను విషయము పరిశీలనార్హము.

గద్య వచన పదముల నిర్వచనమునకు పూనుకొనుటకుముందు ప్రాచీన లాక్షణికు లీ శబ్దములను గురించి వెలిబుచ్చిన యభిప్రాయమును సమీక్షించుట యుక్తము సంస్కృత లాక్షణికులలో నతి ప్రాచీనుడుగా భావింపబడుచున్న భరతుడు గద్యమును గురించి యిట్లు చెప్పియున్నాడు. "వృత్తబద్ధము కానిది, అక్షరనియతి లేనిది అనగా అనిబద్ధపదమును, అర్థాపేక్షతో కూర్పబడిన అక్షరములు కలదియును చూర్ణపదమనఁబడును" చూర్ణనామముతో వ్యవహరింపబడిన గద్యమున కిట మౌలికానిర్వచన మీయబడినది. భరతుని యభిప్రాయమును ఇట్లు విపులీకరించవచ్చును వృత్తబద్ధముకానిది అనగా గణములుకాని, యతిప్రాసములు కాని నియమిత లక్షణమును బట్టి కూర్పనిది అక్షరనియతి లేనిది, అనగా నిర్ణీత గణములు నియమితసంఖ్యలో లేనట్టిది. ప్రత్యేకావసరమునకు తగిన అర్థమును తెలుపునది చూర్ణము—గద్యము అని యాతని యభిప్రాయము

దండి తనకావ్యాదర్శమున భరతుని వాక్యములతో నేకీభవించినాడు. "పాదములులేమి గద్యమౌ పదచయంబు" అనుటచే నిశ్ఛందమగుపదసముదాయము గద్యము అను అభిప్రాయము ధృవపడుచున్నది.

కావ్యాలంకార సూత్రవృత్తిని రచించిన వామనుడు కావ్యభేదములలో గద్యకావ్యమును పేర్కొనెను. గద్యపద్యముల రెంటియందును కావ్యము కూర్పవచ్చునని యా లక్షణకారుని యభిప్రాయము. వామనుడు గద్య మను పదము నిర్వ

చింటక గద్య విభాగములను మాత్రము నిర్వచించెను. విభాగ నిర్వచనమునుబట్టి మౌలిక నిర్వచనమును తెల్పవలయును.

వృత్తగంధి, చూర్ణిక, ఉత్కలికాప్రాయము అను మూడు విధములుగా గద్య ముండునని వామనుడు విభజించెను. "పద్య భాగవత్ వృత్తగంధి" యని చెప్పియున్నాడు. అనగా పదకలోను, రచనలో కొన్ని భాగములందు నిర్ణీత గణములు గద్యములో నుండవచ్చును వామనుడు పేర్కొనిన ఉదాహరణ మిది "పాతాలతాలుతలవాసిషు, దానవేషు" ఈ పాదమున వంసత తిలక వృత్తభాగము ప్రత్యక్షముగా కనిపించుచున్నది. సుదీర్ఘ గద్యరచనలో అనుష్టుబాది వృత్తరచనలు కూడ నుండవచ్చునని ఈతని మతము.

"అనావిద్ధ లలిత పదమ్ చూర్ణమ్" అని రెండవ విభాగమును నిర్వచించెను. అనగా జటిల దీర్ఘ సమాసాదికములు లేనిది, లలిత పదయుతమైన గద్యకావ్యము చూర్ణము. "అభ్యాసోహి కర్మణాం కౌశల మావహతి। నహి సకృన్నిపాతమాత్రే ణోదబిందురపి గ్రావణి నిమ్నతా మాదధాతి" ఈ గద్యమున గంభీరముగా ధ్వనించు పదములు కాని, దీర్ఘ సమాసములుకాని లేవు. తేలిక పదములతో, సులభ గమనము కలది చూర్ణ మనుట వామనుని యభిప్రాయము

ఉత్కలికాప్రాయము చివరి విభాగము. ఉదాహరణ కావ్యములందు కనిపించు రగడ భేదములు కలికోత్కళికలు, తాళలయాన్వితములైనవి. తత్ప్రాయములు ఉత్కలికాప్రాయములు. చూర్ణమునకు విపరీత "ముత్కలికాప్రాయ"మని వామనుని నిర్వచనము. గంభీర పదబాహుళ్యము కలిగి, జటిల దీర్ఘ సమాసోపేతమై కొంతవరకైన తాళ లయానుబద్ధమైన గద్యము ఉత్కలికాప్రాయ మని చెప్పవలెను. "కులిశ శిఖర నఖర ప్రచయ ప్రచండ చపేటాపాటిత మత్తమాతంగ కుంభస్థల గలన్మదచ్ఛటా చ్ఛురిత చారు కేసర భార భాసుర ముఖే కేసరిణి" ఈ వాక్యము గంభీరనాదయుతమైన ఏకైక సమాసము ఇట్టివిఉత్కలికాప్రాయములు. పైమూడు విభాగ నిర్ణయములబట్టి గద్యమునుగురించి వామనుని మతము స్పష్టీకరింపవలెను. గణములుకాని, పాదములుకాని, నియమిత పరిమాణముగాని లేని వాక్య సమూహము గద్య మను పూర్వలాక్షణి కాభిప్రాయముతో వామను డంగీకరించెను. ఇక నెట్టివిధములగు వాక్యములను గద్యములో చేర్చుకొనవచ్చునో వామనుడు చెప్పియున్నాడు పాదరహితములైన వాక్యములందు, అలంకారార్థము నకు కాని, శైలీ పుష్టికొరకు కాని తద్రచయితలు వృత్తపాదములను చేర్చవచ్చును.

పై చెప్పిన వృత్తగంధాది మూడు విభిన్న రచనలు ఔచిత్యమును పాటించి ఆయా సందర్భములం దుపయోగించవచ్చును.

సాహిత్యదర్పణకర్త విశ్వనాథ పండితుడుకూడ గద్య స్వరూపమును గురించి చర్చించెను. వామను డుల్లేఖించిన వృత్తగంధి, చూర్ణిక, ఉత్కళికాప్రాయ మను వానిని మించి యితడు ముక్తక మను వేరొక విభాగమును పేర్కొనెను. వామనుడు చెప్పిన చూర్ణమున నిది యొక విభాగము. సమాసరహితము ముక్తక మనియు, అల్ప సమాసకము చూర్ణమని యాతని భావము. ఈ రెండింటి యుదాహరణములను పరిశీలించినప్పుడు కనిపించునది యీ రెంటిలోనుండు అర్థ శైలీ సౌలభ్యము, జటిల సమాస రాహిత్యము ఇట్లు ఈ రెండు విభాగములందు భేద మతి స్వల్పము సామ్యమధికము అందుకే గంగానాథ్‌జా అను వ్యాఖ్యాత ముక్తకమునకును చూర్ణమునకును భేదము పాటించుట కష్టమనియు, వామను డందు చేతనే దీనిని పేర్కొనలేదని వ్రాసుచ్చి యున్నాడు

ప్రతాపరుద్ర యశోభూషణ కర్త విద్యానాథుడుకూడ గద్యమును నిర్వచించి యున్నాడు. "అపాదః పదసంఘాతో గద్యమ్" అని యాతని మతము. అనగా పూర్వలాక్షణికు లందరితో నీత డేకీభవించెననవలసి యున్నది పైగా వివాదము లందు చొరక ఈతడు ప్రాథమిక నిర్వచనము మాత్రము చేసెను.

సంస్కృతమున గల ప్రముఖ లక్షణకారుల యభిప్రాయము గద్యమును గురించి యొకటియే. నియమితపరిమితి లేనిది, గణపాదబద్ధముకానిది, పలువిధముల రచనకలది గద్యమని. వీరి యభిప్రాయములందు ప్రత్యేకముగా పేర్కొన దగినది యేమన వీరంద రెచటను గద్యమునకు పర్యాయపదముగా కాని, తత్పద సూచనకు గాని వచనమను పదమును ఉపయోగించకపోవుట అనగా సంస్కృతమున గద్యమునకు వచనమను వేరొకనామము లేదను నిశ్చయమునకు రావలెను. ఈ నిశ్చయమును ధృవీకరించుటకు సంస్కృత నైఘంటికుల అభిప్రాయములు సాయపడుచున్నవి.

ఉత్తమ నిఘంటువుగా భావింపబడుచున్న వాచస్పత్యమున గద్యమను పదమున కర్థమువ్రాయుచు తద్రచయిత, పై లాక్షణికాభిప్రాయముతో నేకీభవించి, వృత్తగంధాది భేదములను పేర్కొనెను కాని వచనమను పదమునకు అర్థమును పరిశీలించినపుడు రచనా విభాగమను నొక యర్థము దానికున్నట్లే కావ్పించదు. వచ్—మాటాడు, వచనము—మాటాడినది యను అర్థములు మాత్రమే కలవు. ఆధునిక నిఘంటుకారులగు మానీరు, విలియమ్సు కూడ గద్య మనుదానికి

prose composition, not metrical అని చెప్పి, వచనమను పదమునకు spoken word అని వ్రాసియున్నాడు. అనగా వీతడును వచనమును రచనావిభాగముగా భావించలేదు. సంస్కృతాంగ్ల నిఘంటుకారుడు ఆప్టే మహాశయుడు కూడ పై పాశ్చాత్య నైఘంటికులతో సంపూర్ణముగా నేకీభవించెను. పై విషయములన్నింటివలన, సంస్కృతమున నిర్బంధరచనాభాగమునకు గద్యమనియే కాని, వచనమను పేరు లేదని స్పష్టముగా తేల్పవచ్చును "గద్యపద్యమయం కావ్యం చంపూరిత్యభిధీయతే" యను చంపూలక్షణసూత్రమునందలి గద్యమనుపదము కూడ పై మతమును స్పష్టీకరించుచున్నది.

ఇక ఆంధ్ర రచయితలు, లక్షణకారులీ గద్యవచన పదముల నెట్లు నిర్వచించిరి, వీని నెట్లు ఉపయోగించిరి యని తెలిసికొనుట యవసరము. ఆంధ్రమహాభారతావతారికలో నన్నయభట్టు వచనము నిట్లు పేర్కొనెను. "మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవులును" రాజరాజనరేంద్రుని యాస్థానము నలంకరించియుండిరని వర్ణించెను. ఇచట వచనరచనయను మాటకు గద్యరచన యని యర్థము చెప్పికొనుట కవకాశములేదు. ఎందుకనగా నీ వచనరచనా విశారదులు మహాకవులుగా పేర్కొనఁబడినారు గద్యగ్రంథము సహితము కావ్యమే యగునని చెప్పి, వీరు కావ్యరచయితలన్నచో, రాజరాజు ఆస్థానమున గద్యరచయితలు మాత్రమే యుండిరనవలసివచ్చును. ఇది నన్నయగారి యభిప్రాయమును సరిగా వ్యక్తముచేయుటలేదు. ఇక వచనమను పదమునకు సంస్కృతలాక్షణికులవలె నన్నయకూడ రచనావిభాగముగా భావించక, మాటాడినది అను నర్థమును గ్రహించి, మాటాడునది వచనము కాబట్టి, వచనమనుమాటకు వాక్యము అని నన్నయ భావించియుండును. వచనరచనా విశారదులు అని నన్నయ యనుట ఉత్తమ వాక్య నిర్మాతలు అనగా కావ్యనిర్మాతలు అని నిర్దుష్టముగా తేల్పవచ్చును. ఈ కావ్యములు "మృదుమధుర రసభావ భాసుర నవార్థభాసురములు" ఈ కావ్యనిర్మాతలలో గద్యరచయితలు, పద్యరచయిత లుండవచ్చును

నన్నయ విరచితాంధ్ర మహాభారతము చంపూగ్రంథము కాబట్టి, దానిలో నచ్చటచ్చట ఛందోరహిత వాక్యములను నన్నయ రచించెను నేడు ముద్రిత గ్రంథములం దీ భాగములు వ. అనగా వచనము అనియే పేర్కొనబడుచున్నవి. నన్నయ నాడు కూడ నీ భాగములు వచనములు అని వ్యవహరింపబడినవనుటకు మనకు నిదర్శనములు కానరావు. ఆశ్వాసాంత ఛందోరహిత భాగము లిప్పటికి గద్యములని వ్యవహరింపబడుటచే, నన్నయ అన్ని ఛందోరహిత భాగములను

గద్యములనియే పేర్కొనియుండుననుటకు అవకాశము కలదు తరువాతివారగు తిక్కనాదు లిట్టి భాగములను వచనములని పేర్కొనుటచే, కావ్యపరిష్కర్తల ముద్రణగ్రంథములందు వచనమని వ్రాసియుందురు.

తిక్కన సోమయాజి కాలమునాటికి, అనగా పదుమూడ శతాబ్దము వరకు ఆంధ్ర సాహిత్యకులు గద్య వచన పదములను పర్యాయపదములుగానే భావించిరి. తిక్కన తన ఆంధ్రమహాభారతపీఠికలో "పద్యముల గద్యములఁ రచియించెదఁ గృతుల్" అని చెప్పినాడు. ఇచట నన్నయవలె నీతడుకూడ గద్యమనియే పేర్కొనెనని తోచును కాని యిదే యర్థమున తన నిర్వచనోత్తరరామాయణమున "వాక్యసాంగత్యముచేయుచోనయిన గద్యముతోడుగ జెప్పిపెట్ట" అనియు, "వచనములేకయు వర్ణన రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకు" అనియు గద్యవచన పదములను సమానార్థకములుగా నుపయోగించియున్నాడు ఇట్లు తిక్కన యీరెండు పదములకు భేదమును పాటించలేదనియే చెప్పవలెను. అందు పేర్కొనబడక పోయినను, తిక్కన వ్రాసిన ఉత్తరరామాయణము నిర్వచనోత్తర రామాయణమని వ్యవహరింపబడుటయు నీ యభిప్రాయమునే బలపరచుచున్నది

అయిన నన్నయనాడు లేని భావము వచనమను పదమున కెట్లు కలిగినది యను విషయము గమనార్హము. వచ్ అన మాటాడు. వచనము అనగా మాటాడ బడినది అను అర్థములున్నవని నిఘంటువులు సూచించుచున్నవి వచనము అనగా మాటలు, కేవలమర్థసూచకములుగానుండి సులభగ్రాహ్యములుగానుండును. ఛందోబద్ధము కాని గద్యమనబడు రచనకూడ సులభముగానుండి ప్రధానముగా నర్థసూచకముగానుండును. అర్థసౌలభ్యమను గుణము వచనము (మాటాడబడినది) నిశ్చంద రచనా ప్రక్రియయగు గద్యమునకు సామాన్యము ఈ సామాన్యగుణమును బట్టి ఆంధ్ర సాహిత్యకులు తిక్కనకాలమున గద్యమున కీ పదము నుపయోగించి యుందురు తిక్కన దానిని గ్రహించెను. గద్యమునకు వచనము పర్యాయపదముగానుపయోగింపబడుటకు సోదరభాషయగు కన్నడప్రభావము సహితము కలదు. క్రీ. శ. 12 వ శతాబ్దమున విపసించిన శైవుడు బసవేశ్వరుడు కన్నడమున కొన్ని గద్యగ్రంథములను రచించెను షట్స్థలవచనములు కాలజ్ఞాన వచనములు అనున వీతని విరచితములు. ఈ గ్రంథములు ఛందోరహితములు వచనములనుపేర్ల బరగినవి. నన్నయాదులు చంపూగ్రంథాది సంప్రదాయములను గ్రహించినట్లు తిక్కన తనకు పూర్వుడగు బసవేశ్వరునినుండి యీ వచనపదము స్వీకరించెను.

తిక్కనతరువాతివాడగు పాల్కురికి సోమనాథుడు తాను రచించిన బసవ పురాణ పండితారాధ్య చరిత్ర గ్రంథములందు గద్యమును ప్రస్తావించెను.

"ఉరుతర గద్యపద్యోక్తుల కంచె
సరసమై పరగిన జాను తెనుంగు"

ఇది బసవ పురాణమున నున్నది. గద్యపద్యమయమైన నన్నయ విరచిత భారతమునుగురించి విమర్శనాత్మకముగా చెప్పినది. కొలది భేదముతో దీనినే పండితారాధ్యచరిత్రమునం దిట్లు చెప్పెను.

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి."

"గద్యముల పద్యములన్" రచియించి ప్రబంధమండలి యని తాను స్వయముగా వ్రాసుచ్చిన తిక్కన రచిత భారతమును దృష్టియం దుంచుకొని శివకవి చేసిన విమర్శనము. ఈరెండు సందర్భములందు ఛందోరహిత రచనా ప్రక్రియను సోమన గద్య మనియే పేర్కొనెను. దీనిబట్టి సోమనకాలమున వచన మను వ్యవహారమేలేదని చెప్పుట సరికాదు. ఈతనికి పూర్వుడు తిక్కన వచన పదము నుపయోగించెనుకదా! గద్య వచన పదములందు సోమన గద్యపదమునే యభిమానించి యుండును.

ఆంధ్రలాక్షణికులలో ప్రథమముగా వచనమునుగురించి నిర్వచించినవాడు 15 వ శతాబ్దమున నివసించిన అనంతామాత్యుడు. అతడు తన ఛందోదర్పణమున నిట్లు చెప్పెను "కనుగొన బాద రహితమై- వసుపడి హరిగద్దెవోలె బహుముఖ రచనం-బున మెఱయు గద్య మిది, దాఁ- దెనుఁగుఁ గృతుల వచన మనఁగ దీపించుఁ గడున్." ఇది సంక్షిప్తమైనను గద్యవచనములగురించి అనంతామాత్యుని యభిప్రాయములు పెక్కు విశేషములను తెలుపుచున్నది. గద్యము 'పాదరహితము'గా నుండవలెనట. 'అపాదః పద సంఘాతో గద్యమ్' అను విద్యానాథుని నిర్వచనముతో సరిపోయినది. ఇక "హరిగద్దెవోలె బహుముఖ రచనంబున మెఱయు" వలెను. హరిగద్దె అనగా సహస్రముఖుడైన యాదిశేషుడు. విశృంఖలమైన గద్యరచన సహస్ర ముఖునివలె బహుముఖముల నడువవలెను. అనగా నియమిత పరిమితి గద్యరచన కుండకూడదు. పలువిధముల శైలీ వైవిధ్యము కూడ బహుముఖ రచనయే. ఇదికూడ గద్యమున కుండును ఈ లక్షణములన్ని సంస్కృత గద్యమునకు సరిపోవును. ఇట్టి రచన తెనుఁగున చేసినచో నది వచన

మందు రని చెప్పియున్నాడు. దీనివలన 16 వ శతాబ్దమున ఛందో రహిత రచనలకు వచన మని యాంధ్రమున నుపయోగ ముండెనని స్పష్టమైనది.

తాళ్ళపాక అన్నమాచార్యులు రచించిన సంకీర్తన లక్షణ మను గ్రంథమున వచనము నిర్వచింపబడినది. అన్నమాచార్యులు తనకు ముందు వెలువడిన "సింహగిరి వచనముల"ను దృష్టియం దుంచుకొని యీ నిర్వచనము చేసెను.

"ధర కృష్ణాచార్యాదిక పరికల్పితపదము, తాళబంధ చ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం బరగు నది నిరుక్తనామ భాసితమగుచున్."
"ఛందోగణముల నియతిం బొందక, తాళప్రమాణమున గదుఁ జెలుపై
కొందఱిచేఁ దచ్చూర్ణం బందముగాఁ దాళగంధియనఁ బొగడొందున్ "

పూర్వలాక్షణికులు నుడివిన లక్షణము లన్నియు నీతని నిర్వచనమున మన్నవి విశేష మేమన నీతడు "తాళబంధ చ్ఛందో విరహిత రచనను" వచన మనికాని, గద్యమని కాని పేర్కొనక అది చూర్ణ మనబడునని చెప్పెను చూర్ణ మన నిశ్ఛంద రచన మనియు, గద్యమను నభిప్రాయమున ప్రాచీన లాక్షణికుడు భరతు డుపయోగించినాడు. ఈతని మతమునుపాటించి అన్నమాచార్యులు వచన మను పదమునకు బదులు చూర్ణపద ముపయోగించెను కృష్ణమాచార్య విరచిత ఛందోరహిత రచనలకు చూర్ణములని కాక సింహగిరి వచనములనియే ప్రచారముండుట ఈ యభిప్రాయమును దృఢపరచుచున్నది. సింహగిరివచనములు అంత్యానుప్రాసాది శబ్దాలంకారములతో నొప్పుచు నుండుటచేత అన్నమాచార్యులు దీనిని తాళగంధియనుట కలదనిరి. పూర్వ లాక్షణికులు చెప్పిన వృత్తగంధికి సమానమైనదే యిది. "ఏడు రామాయణంబులు, పదునెనిమిది పురాణంబులు, ద్వాదశ స్కంధంబులు, భగవద్గీతలు, సహస్ర నామంబులు చదివిరేమి, వినిరేమి, ఈ సంకీర్తనకు వేయపాలింటికి సరిరావు" ఇట్లు ఉత్తమ భావబంధురమై ప్రత్యేక శాబ్దికరచనను కలిగియుండుట వలననే అన్నమాచార్యులు వీనిని తాళగంధులని పేర్కొనెను.

ఆంధ్ర లాక్షణికులలో పొత్తపి వేంకటరమణకవి కూడ గద్య నిర్వచనము చేసెను ఇతడు గద్యము నైదువిధములుగా విభజించియున్నాడు. 1. గద్య, 2. బిరుదు గద్య 3. చూర్ణిక, 4 వచనంబులు, 5. విన్నపంబులు. ఈ యైదు విభాగములను ప్రత్యేకముగా నిర్వచించినాడు. కాని యీ నిర్వచనములందు వైవిధ్యము, ప్రత్యేకత చాలతక్కువ. నిర్వచనము స్పష్టముగా లేదు. "ఈ పంచ విధమ్ములు మితి విరహితమ్ములై స్వేచ్ఛాకల్పనా గౌరవమ్ముల కొలంది విలసిల్లి"

అని చివరన చెప్పెను. అనగా వచనరచనకు నియమిత పరిమితి కావి. ప్రత్యేక రచనాపద్ధతి కాని లేదని పూర్వ లాక్షణికాభిప్రాయముతో నిత దేకీభవించెను. ఇతడు విన్నపంబులు, బిరుదుగద్యలు, అను రెండు గద్యవిభాగములు హెచ్చుగా పేర్కొన్నను వాని ప్రత్యేకతను ఇతడు వివరింపలేక పోయెననియే చెప్పవలసి యుండును.

ఆధునికాంధ్ర సాహిత్యకులును గద్య వచనములకు భేదము పాటించక వానిని పర్యాయ వాచకములుగనే వ్యవహరించిరి. చెన్నపురి గ్రామ్యాదేశ సభలో (24-11-1911) చదివిన కందుకూరి వీరేశలింగము పంతులుగారి యుపన్యాస వాక్యము లిట స్మరణీయములు. "రమారమి నలువది సంవత్సరములక్రిందట తెలుగులో గద్యకావ్యములు లేవు అప్పుడు చిన్నయసూరి తన వ్యాకరణమును రచించి యందుకు లక్ష్యముగా నీతిచంద్రిక వచనముగ వ్రాసెను." ఈ వాక్యము లందు పంతులుగారు గద్యవచనముల నేకార్థముగా నుపయోగించిరనుట నిర్వివాదాంశము. "నేనును చిన్నయసూరిగారి త్రోవనే త్రొక్కి కొన్ని గద్యకావ్యములు రచించితిని" ఈ వాక్యము పంతులుగారి పై యభిప్రాయమును మరింత స్పష్టీకరించుచున్నది.

గద్యవచనములు సమానార్థకములని చెప్పుటకు ఆధునిక కావ్యములు కొన్ని నిదర్శనములుగా నున్నవి. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము; అచ్చాంధ్ర నిర్గద్య నిరోష్ఠ్య సారంగధర చరిత్ర. ఈ రెండుగ్రంథములు మౌలికముగా నొకే పద్ధతిని కూర్పబడినవి. కావి. ఒకదానిని నిర్వచనమనుటయు, వేఱొకదానిని నిర్గద్య మనుటయు గద్యవచనములకు గల సమానార్థములను సూచించుచున్నవి.

ఇట్లు నన్నయ తరువాతికాలము మొదలుకొని. నేటివరకు ఆంధ్ర ఛందోరహిత రచనకు గద్యవచనములు సమానముగా వ్యవహరింపబడు చున్నవి.



*సాంఘిక నవల :*

# మరదలు

— శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు

[గత సంచిక తరువాయి]

38

బాగా చీకటిపడింది. నిశి సాంద్రంగా ఉంది ఒకరికొకరు కన్ను కన్ను పొడుచుకున్నా కనుపించటంలేదు చంద్రుడు మళ్ళీ కోవెలను చేరుకున్నాడు చేతిలో ద్రాక్షగుత్తి పదెనిమిది చక్కెరకేళీలు ఇంకేవో రెండు పళ్ళు ఉన్నయి సెలయేటి ఒడ్డున ఆశీనుడయ్యాడు క్రమంగా వాటిని తినటం ఆరంభించాడు ఈ విధంగా సుమారొక గంటకాలం పట్టింది. ఇంకా రెండు చక్కెరకేళీలు ఒకపండు మిగిలినయి, ప్రక్కనఉన్న ఆ తియ్యటి అమృతాన్ని పానం జేశాడు కడుపు సర్దుకున్నాడు. ఏమీ తోచక అటూ యిటూ కలయ జూశాడు పక్షుల కలకలారావం విసుగులేకుండా వినిపిస్తున్నది ఎటుచూసినా చీకటితప్ప ఏమీ కనుపించదు అప్పుడప్పుడు కుందేళ్ళ చప్పుడుకూడా వినిపిస్తున్నది, ఊరికి కాస్త దూరంగా ఉండటంచేత అది అడివిప్రాంతంగా కనుపిస్తుంది చంద్రుడు లేచాడు నలుమూలల కలియదిరిగాడు ఒక చెట్టుకొమ్మవంచి చిన్న మండను విరగ దీశాడు పక్షులు తమకేమైనా ఆపద మూడుతున్నదేమోనని బిగ్గరగా ధ్వని చేసినయి ఆకొమ్మ ఒక లేతమండ దాని ఆకులు చంద్రుడు దూశాడు అది చువ్వవలె పసందైన బెత్తమైంది దాన్ని రెండుసార్లు ఫస్ ఫస్ మనేట్టు ఝళి పించి ధ్వని చేశాడు కుందేళ్ళ కదలికకు ఆకులచప్పుడైంది

చంద్రుడు బహు మొండిపట్టు మనిషి. అందుకనే ఆ రాత్రి అక్కడే నిర్భయంగా కాలక్షేపణ వెళ్ళబుచ్చటానికి నిశ్చయించాడు. అక్కడనుంచి కోవెల మంటపం ఎక్కాడు విఘ్నేశ్వరుడు ప్రశాంతంగా తనతో మాట్లాడ కుండా మూర్ధనుడికిమల్లే ఉన్నతాసనంలో మధ్య కూర్చున్నట్లనిపించింది ఔను! ఆయనబోటి బ్రహ్మచారి యిటువంటి కామాంధ చిత్తులతో ఎట్లా మాట్లాడు తాడు? కోపంతోనే భీష్మించుకుని కూర్చున్నాడు అదిచూసి ఎందుకో చంద్రుడు నవ్వుకున్నాడు. వినాయకుడ్ని జూసి చంద్రుడు నవ్వటం సహజమేగా, ఆయన శపించేవాడే కాని చంద్రుడతనిదృష్టి కానలేదు మొండి బ్రహ్మచారి పెళ్ళా పెటాకులా? ఎందుకయ్యా నీకీ వైరాగ్యం? హాయిగా పెళ్ళిచేసుకుని భార్యతో కాపురం చేయకుండా? అదుగో ఆ హాయిగా అనే దానిలోనే

ఉంది ఉన్నదంతా ఆ హాయిగా కాపురంచేయక అన్న విషయం కాకపోతే నిజంగా వివాహం చేసుకోవచ్చు, హాయిగా అన్నది ఎన్ని అనుకూల పరిస్థితు లలో సానుకూలమయ్యేది గుర్తించారా? అట్లా అందరికీ సాధ్యంకాదు గనుక 'చిన్న నాపొట్టకు శ్రీరామరక్ష' అంటూ కొంతమంది దేవుళ్ళ వివాహంమీద విరక్తి పుట్టినా నామకః వివాహమైనా సంసారాన్ని త్యజించారు. ఎక్కడో కూర్చుని ముక్కుమూసుకొని కృష్ణా రామా అనుకోకుండా ఎందుకొచ్చింది యీ బెడద

వినాయకుడి కిరీటంమీద చెయివేసి వ్రేళ్ళతో త్రిప్పాడు ఇంతలో అతని దృష్టి కొండమీద పడింది సెలయేటిద్వారంపైకి మెల్లగా నడచిపోయాడు అక్కడ తిన్నెపై కూర్చున్నాడు ఆకాశంవైపు చూశాడు నిరాశగా చీకటి మధ్యమధ్య నక్షత్రాలుమాత్రం కనుపిస్తున్నయి మెల్లగా నడిచి కొండకొనకు వెళ్ళాడు అప్పుడు వెన్నెల వచ్చింది ఆవెన్నెల కాంతిలో ఆపెద్ద గ్రామా న్నంతా కలయజూశాడు అది ఆరాత్రి ఎంతో మనోహరంగాఉంది అరమైలు దూరంలోఉన్న తమ గృహంకూడా ఆ కాంతిలో సుస్పష్టంగా కనుపిస్తున్నది. పాము మెలికలవలె క్రమబద్ధంలేని వీధులు, అక్కడక్కడ మేడలు, మధ్య మధ్య విశాలమైన భవంతులు చెట్లచాటున కనుపిస్తున్నాయి తమ యింటికి మాత్రం ఏచెట్టు అడ్డంలేకపోవడంలో సుస్పష్టంగానే కానవస్తున్నది ఇండ్ల సందులనుంచి సన్నని దీపకాంతులు మిణుక్కు మిణుక్కు మంటున్నయి తెల్లని ఆవులు ఎడ్లు నల్లని గేదెలు దున్నలు మేతలు మేస్తున్న చాయలుగూడ కానవస్తున్నయి వీరియిల్లు ఊరికి పడమర చివరఉంది అందులోను జానకి రామయ్య యిల్లు కట్టకడపట, దాని ప్రక్కనే ఉత్తరానికి పోయేడొంక ఉంది. ఆడొంక కిరువైపులా తాడిచెట్లు యీత బొత్తలు ముండ్లపొదలు విరివిగా ఉంటాయి ఆ మార్గమందు పగలే అంతగా జనసంచారం ఉండదు అది ఒక ప్పుడు యేటికిపోయేమార్గం ఇప్పుడు ఇంకొకదోవన పోవటంవల్ల ఆ డొంక పూర్తిగా పాడుబడ్డట్లయిపోయింది అదంతా రాత్రిపూట కీచుమంటూ అడివిగా ఉంటుంది అయినా దానికి జానకిరామయ్య యింటివాళ్ళు బాగా అలవాటు బడ్డారు ఏమైనా వారి యింటికి దొంగభయం లేదు

చంద్రుడు తిరోగమనాన్ని పట్టాడు. ఆకాశంలో చంద్రుని తెల్లని కాంతులవల్ల ఆ కొండ ప్రదేశమంతా పిండార బోసినట్లుంది ఆ వెన్నెలలో తన నీడ సుస్పష్టంగా కానవస్తున్నది అదొక్కటే తన కప్పుడు తోడు నీడ.

మెల్లగా నడక సాగించాడు. క్రిందవైపు మెల్లగా పచ్చిక మేస్తున్న తన సుందర శ్వేతాశ్వం నల్లని యలంకరణములతో కనుపించింది అదే తనకు సర్వదా శరణ్యం. దిగివచ్చాడు అశ్వం అతన్ని జూసి పచ్చిక కొరకటం ఆపే సింది చంద్రుడు దాని మెడను ఆప్యాయంగా కౌగలించుకుని మెడ జూలు నిపురుతూ మెడమీద రెండు చిన్నచరుపులు చరిచాడు దానికి వళ్ళు పులక రించింది ఒకమాటు సకిలించింది చంద్రుడివైపు చూస్తూ చంద్రుడు ఏమీ లేదన్నట్టు చూసి వెనక్కు తిరిగాడు మరొకమారు చూపు సారించి అశ్వం పచ్చిక తిరిగి కొరకడం ప్రారంభించింది

కొలనిలో అతని కేదో తాయం దొరికినట్లయింది దగ్గరకు పోయినాడు అందులో అతనికి ఒకమామ తనకు తోడుగా కనుపించాడు అతడే చందమామ, అందాలచంద్రుడు, నిశాధిపతి, ఉడురాజు ఒకనిమిషం చూసాడు ఇక చూడలేక పోయాడు అతడే రాజు, మన్మథ ప్రేరేపకులలో ముఖ్యుడు చంద్రుడి హృద యంలో ఏదో గుబులుగా రేకెత్తింది ఆ చంద్రుడి బింబంలో సాయంత్రం బండి లోని శృంగార సుశీల ముద్దుమోము నవ్వుతూ కనుపించింది మళ్ళీ చంద్రుడిని చూడగానే ఆ ఎఱ్ఱతామర ముకుళించింది. చంద్రుడికి పట్టలేనంత ఆగ్రహం వచ్చింది తన చేతిలో బెత్తం ఉండగా జుట్టి అందులోకి విసరికొట్టాడు. నీరు అలలుగా చెదరిపోయింది తిరిగి అలలు సర్దుకుని యథాతథంగా చుక్కలరాయడు సాక్షాత్కరించాడు చంద్రుడికి మళ్ళీ కన్నెఱ్ఱనయింది కాని దైవకృపవల్ల సన్ననిమబ్బు తెప్పర ఆ రేరాజుని తన కౌగిటిలో చేర్చుకుని చంద్రుడి బారినుంచి తప్పించింది అపుడు చంద్రుడి కళ్లు చల్లబడ్డయి తన ప్రత్యర్థిని చంద్రుడు చూడలేకపోయాడు నిశారాజు తనపై సవాలు చేస్తున్నాడని భ్రమపడి అతని మీద పగ సాధించబోయాడు అత డిప్పుడు లేడు తను మళ్ళీ దారి మరలిం చాడు కాని అక్కడి చంద్రుడు అప్పుడే పోతాడా ? అతడు తిరిగి తన స్థానా న్నలంకరించాడు అది చంద్రుడు చూడరాదు

వచ్చి సెలయేటిఒడ్డుపై విశ్రమించాడు అప్పటికే అర్ధరాత్రి బాగా తిరిగి పోయింది అక్కడ పడిఉన్న పళ్ళు కనుపించినయి అవి తిన్నాడు మంచినీళ్ళు త్రాగాడు అప్పటికీ ఆలోచనలు అలసిపోయినయి- దేనికైనా చరమదశ అంటూఉంటుందిగా ఒక చిన్న ఆవలింత వచ్చింది ఆ లేపచ్చిక పట్టుపరుపులను మించటంచేత వెంటనే కునుకుపట్టింది. చంద్రుడు వళ్ళుమరిచి నిద్రపోయినాడు అక్కడి పశులు జంతువులు భీతిమాని స్వకార్యములందు నిమగ్నమైనయి కమ్మని పిల్లతెమ్మెరలచే నారేయి ప్రశాంతంగా మనోజ్ఞంగా గడచిపోయింది ★

ఊహాచిత్రము :

# సత్యభామ

—శ్రీ ఆచంట జానకిరామ్

ఆవేళ ద్వారకలో గొప్ప అలజడి

అందరూ, ఆ మాటే చెప్పుకుంటున్నారు "అవ్వ! ఇన్నేళ్లువచ్చి, ఈ బుద్ధులేమిటి? క్రొత్తపోకిళ్ళకైనా, హద్దూపద్దూ ఉండొద్దూ?" అని, నోరు నొక్కుకుంది మందారమాల

"ఆ! ఆ బొమ్మకు తేకపోయినా, అలగాడికైనా తెలియక్కరలేదూ! ఎంత విడ్డూరమో! ఆడినది ఆట, పాడినది పాటగా ఉంది" అన్నది కమలనేత్రి

"ఇంతైంది! ఇంకెంత కానున్నదో!" అన్నది విద్యుల్లత

ఇంత హంగామాకు కారణము సత్యాదేవి లోలకులు!

తనే నమూనాఇచ్చి, క్రొత్తగా చేయించుకుంది సత్యభామ కోలముఖానికి మరింత సొబగునిచ్చాయి బంగారపుకట్టుగట్టిన ఆ మేలిముత్యాలు రెండూ. సాయంత్రమయ్యేసరికి, ఒకరికి తెలియకుండా ఒకరు, సత్యాదేవి ఇంటికంసాలిని పిలిపించి, ఎంతో సొమ్మిచ్చి, తాముకూడా, అటువంటి లోలకులే చేయించుకున్నారు, ఏడుగురు పట్టపుగాణులూ

అచ్చంగా అటువంటివే అన్నాడు విశ్వకర్మ. కాని, ఎక్కడో కాస్త తేడా ఉంచాడు అవన్నీ ఒకెత్తు, సత్య లోలకులుమాత్రం ఒక ఎత్తూ— అందానికి

సత్య అందరిలాగా ఉండదు అన్ని విషయాలలోనూ ఆమెలో ఏదో ఒక ప్రత్యేకత ఉంటుంది ఏదైనా, పెళ్ళీ, పేరంటమూవస్తే, ఊరికి ముందుగావచ్చి కూర్చుంటారు మిత్రవింద, జాంబవతీ ఆ తర్వాత వస్తుంది, రుక్మిణీదేవి 'అందరూ వచ్చారూ, మీ కోసం కనిపెట్టుకున్నారు' అని కబురు వెళ్ళాకనే వస్తుంది, మెల్లిగా, సత్య

నిత్యనూతనమయిన పారిజాత పరిమళము సత్యాదేవి రాకను తెలియజేస్తుంది ఆ ఘుమఘుమలకే అమ్మలక్క లందరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటారు వీరందరూ విలువైన చీనిచీనాంబరాలు ధరిస్తే, ఆమె తెలుపు చేయని, అతి పల్చని, తెల్ల జరీచీర కట్టుకుంటుంది రకరకాల రీతుల జడ అల్లుకొని, ఇన్నిన్ని పువ్వులు పెట్టుకుంటారు వారందరూ. సత్య తలంటుకుని,

వదులుగా జడవేసుకుని, జడలో ఒక్క పారిజాతపు పువ్వే చెక్కుగుంటుంది, ఒక్క పారిజాతపు పువ్వే!

రుక్మిణీదేవికి నగలు చాలా ఇష్టము ఏడు వారాల సొమ్ములూ ఎన్నో ఉన్నాయి ఆమెకు, నానుపేట, కంటె, కాసులపేరు, గజ్జలవడ్డాణము, ఎన్నో, ఎన్నో సత్యకు నడుమున వజ్రాలు తాపిన వడ్డాణము, వంకీలూ, దండ కడియాలూ, మెళ్ళో ఒంటిపేట గొలుసు— వడ్డాణాన్ని తాకుతూ ఉంటుంది గొలుసు మధ్య పచ్చలుతాపిన పతకం, ఆ పతకంపైన, రెండువేపులా కృష్ణుని బొమ్మ నగిషీచేసి ఉంటుంది

తల చక్కగ దువ్వుకొని, ఇన్ని పువ్వులు పెట్టుకుంటుంది, రుక్మిణీదేవి కళ్ళకు ఇంత కాటుక, ముఖాన పసుపు పూసుకుని, అరకాసంత కుంకుమబొట్టు పెట్టుకుంటుంది

ఎప్పుడూ, అప్పుడే తలంటుకున్నట్టే ఉంటుంది సత్య తలకట్టు. సంపెంగ నూనె రాచి దువ్వుకున్నా, నూనె ఉన్నట్టే ఉండవు, స్వతహాగా నల్లగా నిగనిగ లాడుతూ మడమలను తాకే ఆమె శిరోజాలు కుడివైపు, నుదుటివయిన తాండ విస్తూ ఉంటుంది ముంగురుల గుంపు అమ్మవారి పూజలప్పుడుతప్ప ముఖాన పసుపు పూసుకోదు సత్య ముఖాన సన్నని చంద్రవంక దిద్దుకోవడం ఆమెకు చాలా సరదా కృష్ణునికి చాలా ఇష్టమని, ఎడమవైపు చెక్కిలిమధ్య నలుసంత కస్తూరి మచ్చ ఉంచుతుంది చెలికత్తె నర్మద ఎప్పుడోగాని కాటుక పెట్టుకోదు సత్య అదీ అతిసున్నితంగా, బంగారపు కడికతో తీర్చిన సన్నని గీటు జడలో ఒకే ఒక సంపెంగ పువ్వో, మల్లె మందారమో, పారిజాతమో.

రుక్మిణీదేవి ముఖం గుండ్రంగా ఉంటుంది, పూర్ణిమా చంద్రబింబంలా పదహారు వన్నెల పసిడి రంగు సత్యముఖం కోలగా ఉంటుంది పండిన తమలపాకులా తెలుపూ, పసుపూ కలిసి నిగనిగలాడుతూ ఉంటుంది చెక్కిళ్ళపై లేత గులాబీరేకులు తాండవిస్తూ ఉంటాయి నవ్వితే బుగ్గను సొట్టలుపడతాయి సత్య అదృష్టవంతురాలు అంటారు అందరూ అది నిజమే!

పండుగా, పబ్బమూ వస్తే రుక్మిణీదేవి ఇంట అరిశలు చేస్తారు, అన్ని సువాసన ద్రవ్యాలూ వేసి పరమాన్నము చేస్తారు సత్య పోతరేకులు చుట్టిస్తుంది. చారెడు సగ్గుబియ్యం, చారెడు చారపప్పు వేసి పాయసం చేస్తుంది, తానే కాస్త పలకపొడుము కలుపుతుంది కృష్ణునికి ఈ పరిమళమే బాగుంటుంది, రుక్మిణి ఇంటి పరమాన్నములోని అన్నిద్రవ్యాల సువాసనకంటే కృష్ణునికి

ఇష్టమని కమ్మని మినపప్పు పచ్చడి చేయిస్తుంది రుక్మిణీదేవి మామిడికోరు పెరుగు పచ్చడి చేస్తుంది సత్య

కృష్ణుడు వస్తున్నాడు, కృష్ణుడు వస్తున్నాడు అని కనిపెట్టుకున్న రుక్మిణీదేవి, అతను నడవాలో అడుగు పెట్టగానే, చేతిలో ఏ పని ఉన్నా సరే, మానివేసి, గబగబా వెళ్ళి, కాళ్ళుకడుక్కో నీళ్ళిచ్చి, ఆ నీళ్ళు నెత్తిన చల్లుకుంటుంది బంగారపు పువ్వులుతాపిన పావుకోళ్ళు తొడుగుతుంది కాళ్ళకు ఆప్యాయంతో లోనికి తీసుకు వెళుతుంది.

సత్య ఇంటికి వస్తే, సత్య ఏదీ, సత్య ఏదీ, అని వెతుక్కోవలసిందే! నడవాలో, పంజరాలలోని గోరింకలు అతని గొంతుకనే అనుకరిస్తూ సత్య ఏదీ, సత్య ఏదీ అంటూ, అతనికి వెర్రి ఎత్తిస్తాయి గడపదాటి రెండు అడుగులు ముందుకు వేసేసరికి, సత్య కంఠస్వరాన్ని అనుకరింప నేర్చిన పెంపుడు చిలుకలు 'ఇటు', 'ఇటు' అని త్రోవచూపగా, అతడు లోపలి నగళులలోకి వెళ్ళగా వెళ్ళగా, పుష్పించిన పారిజాతపు తరువులమధ్య, పచ్చికపైనకూర్చుని దండలు గుచ్చుతూ ఉంటుంది సత్య

అతనిని చూచి, చిరునవ్వుతో 'వచ్చారా!' అంటుంది తను లేవదు అతడే, ముందుకువంగి, మెళ్ళో దండలు వేయించుకుంటాడు బంగారపు భరణిలో వెచ్చగా పదిలపరచిన దోరగా వేయించిన బాదం పప్పు అతని చేతికి అందిస్తుంది, సత్య రెండుపలుకులు ఆమెచేత తినిపించి, మరీ తాను తింటాడు, శ్రీకృష్ణుడు సత్య స్వయంగా కట్టిఉంచిన కప్పురపువిడె మందుకుంటాడు ఆమె పెదవులనుండి, అతను, తన పెదవులతో

పేరంటానికి వెళితే, పీటమీద కూర్చుని, తాపీగా పసుపు పూయించుకుంటుంది రుక్మిణీదేవి పసిడిగిన్నెలో చెయ్యిముంచి తీసుకుని రెండు చెంపలకూ రాచుకుంటుంది శ్రీగంధం సత్య తూగాడుతూ ముందుకువంగి, చీర జరీఅంచు కాస్త ఒత్తిగించి, ఎడమపాదపు బొటనవేలికి మాత్రం పసుపు రాయించుకుంటుంది—శాస్త్రానికేగా, ఇదిచాలు, అంటుంది, నవ్వుతూ గంధపు గిన్నెలో, అతి సుతారంగా, అంటి అంటనట్టు కొనవేలు మాత్రం ముంచితీస్తుంది ఆమెకు మంచిగంధం చాలా ఇష్టం కాని, తాను శ్రీకృష్ణునితో కలసిఉన్నప్పుడే దాని విలువ

కృష్ణుడు తతిమ్మా రాణులతో ఎంత ఇష్టంగా ఉన్నా, పాటింపదు రుక్మిణీదేవి. అతని సంతోషమే తన సంతోషము అనుకుంటుంది. సత్యకూడా

అంతే, ఐతే, కాస్త తేడా ఉంది. వారెవరూ శ్రీకృష్ణునికి తనపై ఉన్న ప్రేమను పంచుకోలేరనే ధీమా ఉంది సత్యకు. కాని, ఎప్పుడైనా, ఒకప్పుడు, శ్రీకృష్ణుడు ఆమెతో ఉన్నప్పుడు, కాస్త పరధ్యానంగా ఉంటే, ఇట్టే గ్రహించి, "ఏం! రాధ జ్ఞాపకమొచ్చిందా!" అంటుంది సత్య. శరచ్చంద్రికలలాంటి ఆమె చూపులలో అవతరించిన అరుణ కిరణాలు సూదులులా గ్రుచ్చుకుంటాయి శ్రీకృష్ణునికి.

ఎప్పుడైనా, ఊరి ప్రయాణమొస్తే, వారం రోజులు ఏకసర్దుడే, రుక్మిణీదేవి ఇంట. ఇది కావాలి, అది కావాలి అని పురమాయిస్తుంది రుక్మిణి. ప్రయాణపు వేళ కూడా, ఏదో సర్దుతూనే ఉంటారు.

సత్య అలా కాదు. తనకు కావలసిన రెండు తెల్ల జరీ చీరెలూ, రెండు రంగుచీరలు, అతనికి కావలసిన జరీ అంచు పంచలు నాలుగు, పట్టు పంచలూ, పట్టు ఖండువాలు నాలుగూ, ఒక పేము పెట్టెలో పెట్టి, "పదండి, పోదాం" అంటుంది. "ఏమన్నా కావలిస్తే అక్కడే కొనుక్కోవచ్చులే" అంటుంది.

రుక్మిణి గవ్వలాడుతుంది. పచ్చీసు ఆమెకి తగని ఇష్టము. సత్యకు చదరంగమంటే ప్రాణము. ఇట్టే కట్టించివేస్తుంది అతని ఆటను. కృష్ణునికి ఆట రాదని కాదు, ఆమెతో చదరంగమాడుతుంటే అతనికి ఏకాగ్రత ఉండదు.

ఒకరోజు, సత్య ఇంటిలో గౌరీపూజ. అందరు రాణులూ వచ్చారు. తలంటుకుని, ముఖాన, కాళ్ళకూ ఇంత పసుపు పూసుకుని, పెద్ద ఇంత కుంకుమ బొట్టు పెట్టుకొని, తలనిండా పువ్వులు పెట్టుకొని, ఒళ్ళంతా మంచిగంధం అలముకొని, కళకళ్ళాడుతూ వచ్చి శ్రీకృష్ణుని సరసను పీటమీద కూర్చుంది సత్య. దేవి మెడలో మాలవేయటానికి, పోకమొక్కలా ముందుకు వంగిన ఆమె దివ్యమంగళ విగ్రహాన్ని చూస్తూన్న శ్రీకృష్ణుడు అమ్మవారిపై వెయ్యవలసిన పువ్వులు సత్యపాదాలపై వేశాడు!

మరి రుక్మిణికి కోపం రాదూ!



# సంపాదకులకు లేఖలు

*స్రవంతి సంపాదకులకు*

అర్యా!

తమ పత్రికలో శ్రీ రెడ్డిగారు 'మాలపల్లి' నవలగూర్చి వ్రాసిన విమర్శ వ్యాసం చూచాను. ఆ వ్యాసం చివర, నాపైన ఒక విసురు విసిరారు బాధ్యతగల నావంటి విమర్శకులు, "మాలపల్లి" వంటి నవలలో విదేశీ ప్రభావం ఉన్నదనడం బాగాలేదని దానికి తార్కాణలు చూపించమనీ సవాలు చేశారు. 'మాలపల్లి' తెలుగు నవలా వాఙ్మయంలో ఒక విశిష్ట స్థానం అందుకొన్నదని నేను ఎరుగుదును ఈ విషయం, 'కిన్నెర' ప్రత్యేక సంచికలోని నా వ్యాసంలో ఏనాడో పేర్కొన్నాను. అయితే ఇందులోని యితివృత్తం సంగమ దాసు. సెటిల్‌మెంటు వ్యవహారాలు, అస్పృశ్యత మొదలయిన అంశాల వరకు బాగానే ఉంది. కాని ఈ వ్యవహారాలు ప్రచార సాధనలుగా కనిపిస్తాయి తప్ప కథకు రక్తితేలేవు నిజానికి, నవలలో రక్తి కట్టిన విషయము, కమలమ్మ కథే. ఆమె పొరపాటూ, మకూచికం జబ్బూ, మరొక వేషంలో కన్నకొడుకువద్ద దాసీగా చేరడం యీ ఉదంతాలన్నీ కథకు పట్టుతెచ్చాయి. ఇదే రసవంతంగా నడచింది. కాని ఈ కథ అక్షరాలా నూటికి నూరు పాళ్లు, ప్రఖ్యాత ఆంగ్లనవల 'ఈస్టులిన్' అనే కథలోని వస్తువును స్ఫురింప చేస్తుంది. ఇది ఉభయ భాషాకోవిదులందరూ గుర్తించినదే— ఈలాంటి యితి వృత్తాలు గల నవలలు మన తెలుగువాళ్లం చదువుకోవడానికి ఉత్తమోత్తమంగానే ఉంటవి ఇవి అనువాదం చేసి ప్రపంచ నవలాసాహిత్యానికి మన మౌలిక రచనగా అందజేస్తున్నపుడు మాత్రం ఎవరైనా ఈ కథ ఎక్కడో చదివినట్లున్నదే అని ఆరాతీసినపుడు వస్తుంది చిక్కు 'మాలపల్లి' కథ, తమిళ సోదరులకు, బెంగాలీ సోదరులకు చెప్పినపుడు నాకు ఆ యనుభవమే కలిగింది. ఇంతమంచి నవలకు ఇలాంటి మచ్చ లేకపోతే బాగుండునని అస్మదాదులం తపనపడతాం, అంతే,

— శ్రీ వాత్సవ

# ఇన్ సాన్ - హిందీ మాస పత్రిక

సంపాదకులు: శ్రీ లవణం - నాగేశ్వర్

ప్రకాశకులు: సొసయిటీ ప్రింటర్సు, పటమట - కృష్ణాజిల్లా.

సాలు చందా మూడు రూపాయలు

ఇప్పటికి నవంబరు, డిశంబరు సంచికలు వెలువడినవి ఈ పత్రిక విలక్షణమయినది. గాంధీజీ, వినోబాజీ బోధనలతో గూడిన గ్రామరాజ్యము, సర్వసమానత్వము, సర్వోదయము, ఈ పత్రికకు అభీష్టములు - మానవుడయి ఆర్థిక, రాజకీయాది దాస్యములకు లోనుగాక ప్రగతి పథగామి యగుటకు ప్రచారము చేయుటయే ఈ పత్రిక ఆశయము. అట్టి ప్రగతిని సాధించుటకు "నాస్తికత" ప్రబల సాధనమని ప్రముఖ నాస్తికాగ్రేసరులగు శ్రీ గోరాగారి పుత్రులును, మిత్రులును అయిన ఈ సంపాదక మహానీయుల ప్రబల విశ్వాసము "మీరు కోరిన ప్ర. మాకును ఇష్టమే. కాని అందులకు నాస్తికతా ప్రచారము కానక్కరలేదు. ఆస్తిక ప్రచారము వల్లను ఆ లక్ష్యము సాధ్యమే" అని శ్రీ గాంధి, శ్రీ వినోబాజీలు తమ జీవితములవల్ల, ఆచరణవల్ల రుజువుచేసి యున్నారు. కనుక నాస్తికతా ప్రచారము ముఖ్యసాధనము కానక్కరలేదు "సత్యనిష్ఠ, ప్రేమ, మానవసేవ, ప్రయత్నశీలత ఇవి గోరాగారి పరిభాషలో నాస్తిక లక్షణములు. ఆస్తిక లక్షణములుకూడా మా పరిభాషలో అంతే" అని వినోబాజీవంటి పూజ్యులు పలికినట్లు ఈ పత్రికయందే ప్రకటింపబడినది.

ఈ పత్రికలో సర్వోదయ ప్రచారముకంటె నాస్తికతా ప్రచారము ప్రధానాంగముగా నున్నట్లు ఈ పత్రికవల్ల తెలియగలదు. అంతకంటె సర్వోదయ భావములకే ప్రాధాన్యమిచ్చినయెడల ఆస్తికులకును, నాస్తికులకును ఈ పత్రిక జనరంజకముగా నుండగలదని తలచుచున్నాము.

—ద. సూర్యప్రకాశరావు



